# భారత రాజకీయ వ్యవస్థ

( INDIAN POLITY )



మూలం:

శ్రీ అరవిందులు

అనువాదం:

తెన్నేటి పూర్ణచంద్రరావు

AURO-BHARATI PUBLICATION

SRINIKETAN — PONDICHERRY-605 001

# సంపాదకుని విజ్ఞప్తి

శ్రీ అరవిందులదివ్య వాణిని తెలుగువారికి అందించాలనే సంక
ల్పంతో వారి రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించటానికి
"Aurobharati Publications" నిర్ణయించింది. ఈ సంకల్పాన్ని అను
సరించి శ్రీ మాతారవిందుల రచనలనుంచి సంకలనం చేసిన 'India and
her Future' అనే ఆంగ్లగ్రంధాన్ని అనువదించి "భారతదేశ భవిష్యత్తు"
అనే తెలుగు పుస్తకాన్ని ప్రచురించటం జరిగింది.

ఇప్పుడు శ్రీ అరవిందుల " The foundations of Indian
culture అన్న ఆంగ్లగ్రంథంలోని Indian polity అనే అధ్యాయాన్ని
అనువాదంచేసి తెలుగులో భారత రాజకీయవ్యవస్థ అనే పుస్తకాన్ని ప్రచు
రిస్తున్నాము. భారతదేశ ప్రాచీన సంస్కృతిలో ఇమిడి ఉన్న మహత్వ
పూర్ణ విశేషాంశాలను శ్రీ అరవిందులు ఈ గ్రంథంలో తేటతెల్లంచేశారు.
ఈ విషయాలను చక్కగా అవగాహన చేసుకోవటం ఈ నాటి యువతరానికి,
విద్యావంతులకు ప్రప్రథమ కర్తవ్యం. ప్రపంచదేశాలలో భారత దేశానికి
అద్వితీయస్థానం నాడూనేడూ కూడ ఉన్నది. రాబోయే నవయుగానికి
నాందీగీతం ఆలపించవలసింది భారతదేశమే. ఆధ్యాత్మిక చైతన్యం వైపుకు
పురోగమించటానికి మానవజాతి భారతదేశ సహాయ సహకారాలను అభ్య
ర్థించిక తప్పదు. జీవితాన్ని ఆధ్యాత్మిక తత్వంతో సమన్వయం చేయటం,
ఏకత్వం చెడకుండా అనేకత్వాన్ని నిలబెట్టటం భారతదేశానికి మాత్రమే
సాధ్యపడింది. ఇకముందుగూడ భారతదేశం ఈ మార్గాన్నే అనుసరించి
తీరాలి. భారతదేశానికి ఈ శక్తి లభించటానికి గల కారణాలను
ఈ గ్రంథంలో శ్రీ అరవిందులు స్పష్టం చేశారు.

జిజ్ఞాసువులకు, పరిశోధకులకు, రాజనీతిశాస్త్రవిద్యార్థులకు ఈ పుస్త
కం ఉపకరించగలదని ఆశిస్తున్నాను.

భవదీయుడు
డా॥ వి. మన్మోహన్ రెడ్డి
సంపాదకులు
Aurobharati Publications

Pondicherry
0-10-86

# అనువాదకునిమాట

భారతదేశ ప్రాచీన సంస్కృతిని గురించి ఈ నాటి వారు చాలా మందికి సంపూర్ణమైన అవగాహన ఉన్నట్లు కనిపించదు. భవిష్యత్తులో సంభవించబోయే దివ్య చైతన్యా విర్భావ ప్రక్రియలో పాల్గొని దానిని సఫలం చేయాలంటే భారతదేశ ఆత్మ, ఆధ్యాత్మిక చైతన్యం నిర్దేశిస్తున్న గమ్యాన్ని తెలుసుకోనటం అవసరం. గతాన్నించీ పురోగమించి భవిష్యత్తుకు స్వేచ్ఛగా బాటలువేయాలన్నా గతాన్ని గురించిన అవగాహన ఉండక తప్పదు. గతంలో మనలను బలహీనపరచి, మనచైతన్యాన్ని దిగజార్చిన అంశాలను పరిహరించి, మన వ్యక్తిత్వానికి పునాదిగా ఆధారభూమికగా ఉన్న ఉన్నతాంశాలను భావాలను స్వీకరించి మనం ముందుకుసాగాలి.

ప్రాచీన భారతదేశంలో వెల్లి విరిసిన కళా, సాహిత్య, వేదాంత విష యాలను గురించి ఆధునికులకు కొంత వరకైనా అవగాహన ఉన్నది కాని ఆనాటి రాజకీయ సాంఘిక వ్యవస్థలను గురించిన అవగాహన బొత్తుగా లేదు. పైపెచ్చు ఎన్నో అపోహలు ప్రచారంలో ఉన్నాయి. భారతదేశం క్షీణదశలో ఉన్నప్పుడు తలెత్తిన పరిణామాలను గోరంతలు కొండంతలుగాచిత్రించి అవి భారతదేశ చరిత్రలో ఆదినుంచి అంతందాకా ఉన్నట్లు భ్రమపడటం; పాశ్చాత్య ప్రమాణాలు ఆధారంగా భారత రాజకీయ సాంఘిక వ్యవస్థలను అంచనాకట్టటం; ప్రపంచ చైతన్య వికాసంలో భారతదేశం నిర్వహించిన మహోన్నత పాత్రను గురించిన పరిజ్ఞానం లోపించటం దీనికి కారణాలు. భారతదేశ ప్రాచీన వ్యవస్థలో లోపాలు లేవనలేము: కాని ఆలోపాలు ఏవో గుర్తించి అవి పునరావృత్తం కాకుండా జాగ్రత పడటానికి, ఇతరదేశాలకు దుస్సాధ్యమై భారతదేశానికి విశిష్టతను సంతరించిన లక్షణాలను పోగొట్టు కోకుండా భవిష్యద్భారతాన్ని తీర్చిదిద్దటానికి భారతదేశప్రాచీన సంస్కృతిని గురించి, ముఖ్యంగా రాజకీయ సాంఘిక వ్యవస్థలను గురించి చక్కగా తెలుసుకోవాలి. ప్రస్తుత గ్రంథం ఆ ప్రయోజనాన్ని నెరవేర్చగలదు. శ్రీ అరవిందుల దివ్యవాణి మన అంతరంగాలలో వెలుగు నింపగలదని, త్వరితంగా గమ్యాన్ని చేరటానికి కావలసినస్ఫూర్తిని, ఉత్తేజాన్ని మనకు ప్రసాదించగలదని వేరుగా చెప్పవలసినపనిలేదు.

అనువాదకర్త : తెన్నేటి పూర్ణచంద్రరావు

# 1

మానవుని అతని అత్యుదాత్తమైన అంతర్నిహిత శక్తుల స్థాయికి, ఒక మానసిక ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, నైతిక, సౌందర్యప్రియ జీవిగా, చేర్చగల మానవ సంస్కృతికి అతిముఖ్యమైన కార్యకలాపాలలో భారతీయ నాగరికత సాధించిన గొప్పతనాన్ని గురించి ఇంతవరకు నేను చెప్పడం జరిగింది. దాని చైతన్య ఉద్దేశాలనుగురించి నిజమైన అవగాహనతో, అసలు అది సాధించిన విజయాన్ని సునిశిత వివేచనాత్మక పరిగణనతో పరిశీలిస్తే అది ఎంత ఉన్నతమైనదో, గొప్పదో, అపార ప్రజ్ఞతో కూడి ఉన్నదో తెలుస్తుంది : ఈ విషయాల పట్ల విమర్శకుల అసంగత ఆక్షేపణలు పటాపంచలవుతాయి. ఇందువల్ల ఇది ఒక గొప్ప నాగరకత అని మాత్రమేగాక ఈనాటికీ లిఖితాధారాలు లభించే అరడజను అత్యున్నత నాగరకతలలో ఒకటి అని వెల్లడి అవుతుంది. మనస్సు, ఆత్మ చైతన్యాలకు సంబంధించిన వాటిలో భారతదేశం విజయాన్ని సాధించిందని అంగీకరించి నప్పటికీ, జీవితంలో అది విఫలమై పోయిందనీ, మనకు యూరపు చూపించిన బలీయమైన, జయప్రదమైన, లేదా అభివృద్ధి కారకమైన జీవిత వ్యవస్థ దాని సంస్కృతివల్ల ఫలించలేదనీ; కనీసం చివరి దశలో తన మనఃస్థితి లోని అత్యున్నత భాగం జీవితాన్నుంచి వెనుదిరిగి సన్న్యాసానికి ఉన్ముఖమై పోవటమేగాక వ్యక్తి నిష్క్రియుడై, ప్రపంచాన్ని కాదని తన వ్యక్తిగత ఆధ్యాత్మిక మోక్షం కోసమే ప్రయత్నించటం జరిగిందని అనేవారు చాలా మంది ఉన్నారు. మహా అయితే ఒక స్థితివరకు రాగలిగినా ఆ తరువాత అది ఆగిపోయి క్షీణించటం జరిగింది.

ఆధునిక మానవుడు, ఆధునిక సాంస్కృతిక మానవుడు కూడ, అన్నింటికన్న బాహ్యస్థితి సామర్థ్యాన్నే ఎక్కువ విలువైనదిగా భావించే

ఒక రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవిగా, అదివరకు ఎన్నడూ కానంత రాజ కీయ జీవిగా అయినాడు : లేదా కాగల ప్రవృత్తి కలిగి ఉన్నాడు. మనస్సు, ఆత్మ చైతన్యాలకు చెందిన విషయాలను, పూర్తిగా కాకపోయినా, ప్రధా నంగా మానవ జాతి జీవన, యాంత్రిక వికాసానికి తోడ్పడేవిగానే పరిగణి స్తున్నాడు. అత్యున్నత ఔన్నత్యాల వైపు దృష్టి సారించి, మనస్సు ఆత్మ చైతన్యాల విషయాలలో సాధించిన విజయాన్ని తిరుగులేని ప్రశంసతో లోతైన పూజ్యభావంతో, దాని కోసమే దానిని, మానవ సంస్కృతికి పురోగతికి మహా ఘనమైన తోడ్పాటుగా భావించిన ప్రాచీనుల పరిగణన అతనికి లేదు. ఆధునికమైన ఈ ప్రవృత్తి, అతిశయ వర్ణనలో అసహ్యంగా కన్పించినా, అతిశయోక్తులలో అది ఎంతో నీచస్థితికి దిగజారినా, మానవ జాతి ఆధ్యాత్మిక వికాసానికి అది ప్రతికూలమే అయినా దాని వెనుక కొంత నిజం లేకపోలేదు. సంస్కృతి మొట్టమొదటి విలువ అంతరంగిక మానవుని అంటే మనో జీవ చైతన్యాలను,సముద్ధరించి విస్తరింపజేయటమే అయినప్ప టికీ, అతని బాహ్యస్థితిని రూపుదిద్ది ఉన్నతమైన, ఘనమైన ఆదర్శాల దిశలో పురోగమించె లయబద్ధ చలనంగా దానిని చేయకపోతే దానిప్రతిష్ఠత సంపూర్ణంకాదు. అభివృద్ధిఅంటే నిజమైనఅర్థం ఇదే. పటిష్ఠమైన రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవనము, ప్రజలు జీవించి ఉండి వృద్ధిచెందేటట్లు ఒక సామూహిక పరిపూర్ణతవైపు భద్రంగా కదలిపోయేటట్లుచేయగలసామర్థ్యము మనస్సు ఆత్మచైతన్యాలకు తమబాహ్యప్రకటనలో, నిరంతర స్థిర పురోగమ నానికి అవకాశం కల్పించే సజీవ, మృదు ప్రతిస్పందన; దానిలో భాగంగా ఉండాలి. ఈ లక్ష్యాలను సంస్కృతి సాధించలేకపోతే దాని సారభూత భావరూపాలలో గాని, దాని పూర్ణతలోగాని, అనువర్తనలోగాని ఎక్కడో ఒకచోట లోపం ఉన్నదన్నమాట. దీనివల్ల ఆ సంస్కృతికి సమగ్రమైన సంపూర్ణమైన విలువ ఉన్నదని చెప్పుకొనటానికి వీలులేకుండా పోతుంది.

భారతీయ సమాజ శరీర చైతన్యాలను పరిపాలించిన ఆదర్శాలు అత్యున్నత శ్రేణికి చెందినవి. దాని సాంఘిక వ్యవస్థ, తొలగించటానికి వీలు

లేని ప్రధానమైన స్థిరత్వాన్ని సమకూర్చింది. దానిలో వర్ధించిన ప్రబలజీవ శక్తి అసాధారణశక్తిని, సౌభాగ్యాన్ని, ఆసక్తిని సృష్టించింది. దాని జీవ నిర్వాహణలోని సమృద్ధత; ఏకత్వంలోవైవిధ్యం, సౌందర్యం, ఉత్పాదన శక్తి, గమనశీలత గణనీయమైనవి. భారతదేశచరిత్ర, కళా, సాహిత్యాల లిఖితాధారాలు ఈ లక్షణాలతోకూడిన సాంస్కృతిక జీవితానికి సాక్ష్యాలుగా ఉన్నాయి. క్షీణతలోను వినాశనంలోనుకూడ, ఎంత అస్పష్టంగానైనా దూరంగానైనా, ప్రాచీన మహత్త్వాన్ని స్ఫురింపచేసే ముద్ర ఇంకాచెరగ కుండా నిలిచిఉన్నది. మరి, భారతీయ సంస్కృతి జీవశక్తికి ప్రాతినిధ్యం వహించటంలేదనే అభియోగానికి అర్థం ఏమిటి? అది ఎంతవరకు సమర్థించ తగింది? క్షీణదశ లక్షణాలను దాని ప్రాచీన మహత్త్వ పూర్ణదశకు కూడా పట్టించటం జరిగింది. స్వేచ్ఛాప్రతిష్ఠ రాజకీయ వ్యవస్థను నెలకొల్పటంలో భారతదేశం ఎప్పుడూ అసమర్థతనే ప్రదర్శించిందనీ, నిరంతరం విభజనకు లోనౌతూ, తనసుదీర్ఘచరిత్రలో, చాలవరకు బానిసజాతిగా ఉండిపోయిందనీ గతించిన అర్థశతలు ఏవైనా దాని ఆర్థిక వ్యవస్థ కదలికలేని మృదుత్వం లేని స్థితిలోనే ఉండటంవల్ల, ఆధునిక పరిస్థితులలో పేదరికానికి, వైఫల్యానికి దారితీసిందనీ, దానిసమాజం అభ్యుదయ రహితమైన విభిన్నస్థాయిలతో కూడిన కుల వ్యవస్థగా, దాదాపు ఆటవిక దురాచారాలతోనిండి గతించిన శిథిలావశేషాల చెత్తకుప్పలో పారవేయడానికి మాత్రమేఅర్హతకలిగిందనీ, దాని స్థానంలో యూరోపియన్ సంఘ వ్యవస్థకుచెందిన స్వేచ్ఛ, ప్రతిష్ఠల పరిపూర్ణత, అభ్యుదయ సంపూర్ణతలను ప్రతిష్ఠించటం జరిగిందనీ, ఈఆరోపణకు అర్థం. నిజమైన వాస్తవాలను వాటి అర్థాలను పునఃస్థాపించటం అవసరం. ఆ తరువాతనే భారతీయ సంస్కృతి రాజకీయ, ఆర్థిక, సాంఘిక దృక్పథాలను గురించి తీర్పుచెప్పవలసిన సమయం వస్తుంది.

భారత రాజకీయ అసమర్థతనుగురించిన కట్టుకథ, చారిత్రకాభివృద్ధిని మిథ్యాదృక్పథంనుంచి చూడటంవల్లా, ఆదేశంయొక్క ప్రాచీన గతాన్ని

గురించిన అసమగ్రజ్ఞానంవల్లా జనించింది. అధిక స్వేచ్ఛతోకూడిన అనాగరక ఆర్య, లేదా వైదిక సాంఘిక- రాజకీయవ్యవస్థ ఒకేసారిగా, సాంఘికంగా బ్రాహ్మణ మత నిరంకుశాధిపత్యం వైపు, రాజకీయంగా నిరంకుశ ప్రాచ్య రాజరికంవైపు. అంటే పశ్చిమ ఆసియా రకానికి చెందిన వ్యవస్థవైపు కదలి పోయినట్లు చాలాకాలంగా అందరూ అనుకొంటున్నారు. మరింతజాగ్రత్తగల దురభిమాన రహితమైన పాండిత్యం, ఈవిధమైన భారతదేశచరిత్ర అసమగ్ర పఠనాన్ని నిర్మూలించింది. అసలువాస్తవాలు వేరుగాఉన్నాయి. పోటీలు పెనుగులాటలతో కూడిన. భారిమైన పారిశ్రామిక వ్యవస్థనుగాని, స్వేచ్ఛా పూర్వక పార్లమెంటరీ వ్యవస్థనుగాని, యూరోపియన్ అభివృద్ధి ఆవర్తనానికి చెంది బూర్జువా లేదా వైశ్యయుగానికి లక్షణమైన ప్రజాస్వామ్యంగా చెప్పు కొనే దానినిగాని భారతదేశం రూపొందించుకోలేదన్నమాట నిజమే. కాని ఇదే ఆదర్శస్థితిగా, సాంఘిక రాజకీయ పురోగతిలో చివరి మాటగా, విమర్శ రహితంగా పొగడ్తలను కురిపించటం గొప్పతనంగా ఉండేకాలం గతించి పోతున్నది. వీటి లోపాలు ఇప్పుడు గోచరిస్తున్నాయి. ఒక ప్రాచ్యనాగరకత మహత్త్వాన్ని పాశ్చాత్య పరిణామాల ప్రమాణాలనుబట్టి నిర్ణయించవలసిన పనిలేదు. ఆధునికభావాలు, ప్రజాస్వామ్య పద్ధతులు పార్లమెంటరీ వ్యవస్థ సహితం గతంలో భారతదేశంలో ఉన్నాయని చూపటానికి భారతీయ పండితులు ప్రయత్నించారు కాని నాదృష్టిలో ఇది వివేక రహితమైనదిగా కనిపిస్తుంది. పాశ్చాత్య పదజాలాన్ని ఉపయోగించవలసివస్తే భారతరాజకీయ వ్యవస్థలో బలమైన ప్రజాస్వామ్య అంశ మేగాకుండా పార్లమెంటరీ వ్యవస్థ రూపంతో కొంతపోలిక కలిగిన సంస్థలు కూడ ఉండేవి. కాని ఈ లక్షణాలు భారతదేశానికి సొంతమైన విధానంలోనేతప్ప, ఆధునిక పార్లమెంటు ఆధునిక ప్రజాస్వామ్యాలతో ఏ మాత్రము సమానమైనవికావు. ఈవిధంగాచూస్తే, పాశ్చాత్య ప్రమాణాన్నిబట్టి దాని సాంస్కృతిక ఆవర్తనంయొక్క విచిత్ర

మైన అవసరాలను బట్టి అంచనా కట్టినప్పటికంటే, సాంఘిక మనశ్శరీరాల సమ్మేళనానికి సజీవమైన అనుకూల్యతను కలిగి ఉండటంలో భారతీయ ప్రజలకు గల రాజకీయసామర్థ్యానికి ఇవి మరింత గణనీయమైన సాక్ష్యాధారాలు అవుతాయి.

సాధారణంగా ఆర్య ప్రజల తొలిచరిత్రకు సంబంధించినదని చెప్పబడుతున్న విధానానికి మరొక రూపంగా భారతీయ వ్యవస్థ ప్రారంభమైంది. కాని కొన్ని లక్షణాలు మరింత సామాన్య స్వభావం కలిగి, మానవజాతి సాంఘికాభివృద్ధి క్రమంలో ఇంకా తొలి దశకు చెందినవిగా ఉన్నాయి. అది కులమనబడిన "ట్రైబల్" వ్యవస్థ. కులంలో జాతిలో స్వతంత్ర వ్యక్తులందరి సమానత్వమే ఈ వ్యవస్థకు పునాది. మొదట ఇది ప్రాదేశికత మీద స్థిరంగా ఆధారపడి ఉండలేదు. వలసపోయే ప్రవృత్తి స్పష్టంగా ఉండేది లేక ఒత్తిడి కలిగినప్పుడు తిరిగి సంభవించేది. భూభాగాన్ని ఆక్రమించిన వారిపేరుతో కురుదేశమలేక "కురులు" మాలవదేశంలేక "మాలవులు" అన్నట్లుగా పిలిచేవారు. నిర్దిష్టమైన హద్దులలో స్థిరనివాసం ఏర్పడ్డతర్వాత కులవ్యవస్థ కొనసాగిందికాని, స్థిరపడిన గ్రామీణసమాజం దాని ప్రధానాంశంగా, లేక దాని సంవిధాన పరమాణువుగా ఉండేది. విశః అనబడే ప్రజా సమావేశం సామాజిక వ్యవహారాలకోసం, పూజాయజ్ఞాలకోసం, యుద్ధనిర్వహణకోసం జరుపబడుతూ, జనసమాజ అధికారచిహ్నంగా, అధిపతిగా ప్రతినిధిగా ఉండే ప్రభువుతో క్రియాశీల సామాన్యజీవనానికి ఏజంటుగా చాలాకాలం నిలిచే ఉన్నది. తన అధికారస్థితి వంశపారంపర్యంగా, రూపొందిన తర్వాతకూడ ప్రభువు లాంఛనప్రాయమైన తన ఎన్నిక కొరకు లేదా ధృవీకరణ కొరకు ప్రజలసమ్మతిమీదనే ఆధారపడేవాడు. యజ్ఞము అనే మతసంస్థవల్ల, కాలక్రమేణ పురోహితవర్గము, ఉత్తేజితులైన గాయకవర్గము, మతాచారనియమాలలో సుశిక్షితులై లేదా యజ్ఞచిహ్నాల ఆధ్యాత్మిక రహస్యజ్ఞానము కలిగిన

వర్గము రూపొందాయి. ఇదే బ్రాహ్మణ మహాసంస్థకు వి త్తనం అయింది. మొదట వీరిలో వంశపారంపర్య పద్ధతిలేదు; ఇతరవృత్తులు నిర్వహించు కొంటూ మామూలు జీవితంలో సాధారణప్రజానీకంలో వీరుభాగంగా ఉండే వారు. ఆర్య భారతదేశం అంతటా, మొదట, ఈవిధమైన స్వేచ్ఛాయుతమైన సరళ. సహజ సామాజిక సంవిధానమే సర్వసాధారణంగా ఉండేది.

ఈప్రాథమిక రూపంనుంచి తరువాతకాలంలోవచ్చిన అభివృద్ధి ఒక పరి మితివరకే ఇతరజాతులలో కనిపించే సాధారణ వికాస పద్ధతిని అనుసరిం చింది. కానిఅదేసమయంలో తమకుతాముగా స్థిరపడినకొన్ని గమనార్హమైన విచిత్రాంశాలు ప్రధానలక్షణాలుగా పరిణమించి, భారతీయ నాగరకతలోని రాజకీయ ఆర్థిక సాంఘికాంశాలమీద భిన్నమైన ముద్రవేశాయి. వంశపారం పర్య సూత్రం తొలి దశలో ఆరంభమైంది, సర్వత్రా దాని కార్యకలా పాల సంపూర్ణ వ్యవస్థకు ఆధారం అయ్యేటంతవరకు సంఘంమీద తనఅధి కారాన్ని, పట్టును నిరంతరం అధికం చేస్తూవచ్చింది. వంశపారంపర్యంగా రాజరికం నిలదొక్కుకున్నది; రాజసంబంధమైన, వీరుల వర్గం ఒకటి అవ తరించింది. మిగిలిన వారందరిని వర్తకులు, చేతిపనివారు,వ్యవసాయదారుల జాతిగాగుర్తించటంజరిగింది. బహుశః కొన్నిసార్లు యుద్ధవిజయాలకారణంగా, చాలసార్లు ఆర్థికవ్యవస్థకు సేవకులు కార్మికులు కావలసివచ్చిన కారణంగా ఒక పరాధీన సేవకజాతిని దీనికిచేర్చటం జరిగింది. తొలినాళ్ళనుంచీ భారత ప్రజల మనోఫలకం మీద అధిక ప్రాబల్యంవహించిన మత, ఆధ్యా త్మిక ప్రవృత్తి, పురోహితులు, పండితులు, న్యాయశాస్త్రవేత్తలు, పవిత్రవేద పాండితీ మండితులు అయిన బ్రాహ్మణులవర్గాన్ని సాంఘిక వ్యవస్థ అగ్ర భాగాన నిలబెట్టింది. ఇతరచోట్లగూడ ఇటువంటిది జరిగినా, ఇక్కడ దీనికి నిరుపమాన శాశ్వతత్వం, అసందిగ్ధస్థితి, అత్యుచ్ఛ ప్రాముఖ్యతలభించాయి.

ఇంతకన్న మనఃస్థితి తక్కువసంశ్లిష్టంగ ఉన్న ఇతరదేశాలలో ఈప్రాబల్యం మతరాజ్యవ్యవస్థకు దారితీసేది. కాని నిత్యమూ పెరుగుతూ చివరకు ప్రబలమైన అధికారాన్ని పొందినప్పటికీ బ్రాహ్మణులు భారతదేశంలో రాజకీయాధికారాన్ని హస్తగతంచేసుకోలేదు; చేసుకోలేకపోయినారు. ప్రభువుకు ప్రజలకు పవిత్ర పురోహితులుగా, న్యాయశాస్త్రజ్ఞులుగా, ఆధ్యాత్మిక గురువులుగా వారికి గణనీయమైన పలుకుబడిఉండేది. కాని క్రియాశీలమైన అధికారం మాత్రం ప్రభువుకు, ఉన్నతక్షత్రియ వంశీయులకు, సామాన్య ప్రజానీకానికే ఉండేది.

కొంతకాలంవరకు "ఋషి" ఒక విచిత్రవ్యక్తిగాఉండేవాడు. ఆధ్యాత్మికానుభవము, విజ్ఞానము కలిగి ఏవర్గంలోనైనా జన్మించినవాడుగా ఉండేవాడుకాని తన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం కారణంగా అందరిమీద అధికారం నిర్వహించేవాడు. తనకు కొన్నిసార్లు మత గురువుగా ఉండే ఈ ఋషిని ప్రభువు పూజించి సంప్రదించేవాడు. సాంఘిక వికాసం ఇంకానిశ్చితరూపాన్ని పొందని ఆస్థితిలో కొత్తభావాలను పెంపొందించటంలో, ప్రజల సాంఘిక-మత భావాలను ఆచారాలను ప్రత్యక్షంగా తక్షణమే మార్పుచేయటంలో అతి వొక్కడే ముఖ్యపాత్ర వహించేవాడు. అత్యంత బాహ్యమైన జీవిత రాజకీయ సాంఘిక పరిస్థితులతో సహా అన్నిటికి ఒక ఆధ్యాత్మిక అర్థాన్ని అనుసంధించటం భారతీయ మనఃస్థితి విశిష్టలక్షణం. అది, అన్నితరగతులవారి మీద, వారివిధులమీద, ఎప్పుడోతప్ప హక్కులకు అధికారాలకు చెందినది గాకుండా విధులకుచెందిన ఆదర్శాన్ని, అదిచేయవలసిన పనులకు సంబంధించిన నియమాన్నిఆదర్శవిధానాన్ని, స్వభావాన్ని, శీలాన్ని, కర్మచైతన్యాన్ని, ఆధ్యాత్మిక ప్రాముఖ్యతగల ఒకధర్మాన్నివిధించింది. జాతిమనోఫలకం మీద ఈ చెరగనిముద్రవేయటం,దానిని కొనసాగిస్తూ శాశ్వతంగాఉండేటట్లు చూడటం, ఆదర్శన్యాయాన్నిదాని ఆచరణాత్మక అర్థాన్ని కనిపెట్టి వ్యాఖ్యా

సించటం ఆధ్యాత్మిక మత జ్ఞానం పునాదిగా గమనార్హమైన నాగరిక రూపా
ఖిలో చక్కగా మలచిన ఆదర్శాలలో ప్రజాజీవితాన్ని మూసపోయటం
ఋషి నిర్వహించ వలసినకార్యం తరువాత కాలాలలోని బ్రాహ్మణ ధర్మ
సంప్రదాయాలు తమసంహితలను-నిజానికి అవి ఆనాటినియమాలను ఆచారా
లను సూత్రీకరించేవి అయినప్పటికీ-ప్రాచీన ఋషులకు ఆపాదించటం కని
పిస్తుంది. తరువాతకాలంలో భారత సాంఘిక-రాజకీయ వ్యవస్థలో ఏపరిణా
మాలు సంభవించినా స్వేచ్ఛాయుత సజీవ ఆచరణను అనుసరించి ముందుకు
పోవటానికిబదులు చివరకు అన్నీ సాంప్రదాయబద్ధమై ఆచారనిష్ఠమై
ఉన్నప్పుడుకూడ, ఈప్రారంభలక్షణం తనప్రభావాన్ని చూపిస్తూనే
ఉండేది.

తొలినాళ్ళ ఈ వ్యవస్థ రాజకీయపరిణామం భారతదేశంలో వివిధ
భాగాలలో వివిధంగా ఉండేవి. చాల దేశాలలోవలె సాధారణపరిణామం, అధి
కంగా సంశ్లిష్టం అవుతూవచ్చిన రాజ్యాధికార నిర్వహణవ్యవస్థకు కేంద్రంగా
అధిపతిగా, సమైక్యతాంశంగాఉండే ప్రభువుఅధికారానికి ప్రాముఖ్యతను
ఇచ్చేదిశలోనే సాగింది. కాలక్రమంగా ఇదే విజయంసాధించి సర్వసాధారణ
పద్ధతిగా రూపొందింది. చాలాకాలం దీనిని ఎదిరించి అదుపులోపెట్టిన ఒక
వ్యతిరేక ప్రవృత్తి పట్టణ ప్రాంతీయ సంవిధాన గణతంత్రరాజ్యాలు అవ
తరించి బలమైన శాశ్వతమైన జీవశక్తిని సంతరించుకోవటానికి కారణమైంది.
గణతంత్ర రాజ్యానికి వంశపారంపర్యంగా వచ్చిన లేదా ఎన్నికైన ప్రభు
త్వాధిపతిగా గాని, కొద్దికాలం స్థిరంగా పరిపాలన సాగించిన అధ్యక్షు
డుగా గాని ప్రభువు వ్యవహరించేవాడు ఆలా లేకపోతే రాజ్య పరిపాలనా
వ్యవస్థలో నుంచి స్థానం లేకుండా పోయేవాడు చాలా సందర్భాలలో
ఈ మార్పు, ప్రజా సభల అధికారం సహజ వికాసం పొందటం వల్ల
వచ్చినప్పటికీ, ఇతర సందర్భాలలో ఈ ఫలితం ఏదో విధమైన విప్లవం
కారణంగా కలిగినట్లు కనిపిస్తుంది. ఎన్నో ఒడిదుడుకులు, రాజకీక

గణతంత్ర రాజ్య యుగాలు ఒకటి తర్వాత ఒకటి పర్యాయంగా రావటం గోచరిస్తాయి. కొంత మంది భారత ప్రజల మీద, చివరకు, గణతంత్ర రూపమే ప్రబల ప్రభావాన్ని పొంది, శతాబ్దాలు సుదీర్ఘ కాలం నిలువ గల బలమైన స్థిరమైన వ్యవస్థగా నిరూపితమైంది. కొన్ని సందర్భాలలో ప్రజాస్వామ్య ప్రతినిధి సభ వారిని పరిపాలించేది గాని చాల చోట్ల పరిమిత పాలక వ్యవస్థలోని రాష్ట్రి సభ పరిపాలన సాగించేది. దురదృష్టవశాత్తు భారతీయ గణతంత్ర వ్యవస్థల రాజ్యాంగ విధానం గాని, దాని అంతర్గత చరిత్ర గాని మనకు తెలియటం లేదు. కాని వాటి పౌర వ్యవస్థ ఉత్కృష్టత వాటి సైనిక వ్యవస్థ దుర్జయత్వం భారతదేశం అంతటా ప్రఖ్యాతి గడించినట్లు సూచించే స్పష్టమైన సాక్ష్యాధారాలు న్నాయి. పరిశుద్ధంగా, శక్తివంతంగా గణతంత్ర సంస్థలను నిర్వహించినంత కాలము, ఇటువంటి చిన్న రాజ్యాలైనా సరే శక్తివంతము విజయోత్సాహ పూరితము అయిన మగధ రాజ్య ఆయుధ శక్తి ఓడించలేదు అనే బుద్ధుని ఆసక్తిదాయకమైన వచనం ఒకటి ఉన్నది. రాజకీయపరంగా, సైనికపరంగా ప్రభువుకు గణతంత్ర రాజ్యాల కూటమికి మించిన దిట్టమైన విలువైన ఆసరా లేదనీ,వీటిని తగ్గించాలంటే ఆయుధ బలం కన్నా- ఆయుధ బలం విజయాన్ని చేకూర్చే అవకాశం సందేహాస్పదం కనుక- గ్రీకు దేశంలో మాసెడాన్‌కు చెందిన ఫిలిప్ చక్రవర్తి అవలంబించిన కుతంత్ర మార్గాల ద్వారా అంతర్గత సమైక్యతను, వాటి సంవిధాన సామర్థ్యాన్ని తెలియకుండా హరించడమే మంచిదని సలహా యిచ్చిన రాజకీయ గ్రంథకర్తలు ఈ అభిప్రాయాన్నే ధృవపరిచారు.

ఈ గణతంత్ర రాజ్యాలు అప్పటికి చాలా కాలం క్రిందటే స్థిరపడి క్రీస్తు పూర్వం ఆరవ శతాబ్దంలో శక్తివంతంగా వ్యవహరిస్తూ ఉండేవి. అంటే ప్రకాశవంతములైనా క్షణభంగురాలు కల్లోలితాలు అయిన గ్రీకు నగర రాజ్య కూటాలకు అవి సమకాలికాలన్న మాట. కాని భారతదేశంలోని

ఈ రాజకీయ స్వాతంత్ర్య రూపం గ్రీకు గణతంత్ర స్వాతంత్ర్యం కన్న ఎక్కువ కాలం మనగలిగింది. అచంచల వ్యవస్థీకరణ లోను, సుస్థిర సంవిధాన క్రమంలోను భారతీయ మనఃస్థితి, రాజకీయ నూత్న కల్పనలో తీసిపోయింది కాకపోయినా, చంచలము వ్యాకులము అయిన మెడిటరేనియన్ ప్రజల మనఃస్థితి కన్న శ్రేష్ఠమైనదిగా పరిగణించక తప్పదు ఈ రాజ్యాలు కొన్ని, గణతంత్ర రోముకన్న సుదీర్ఘమైన జీవశక్తి కల చరిత్రను కలిగి ఉన్నట్లు కన్పిస్తుంది. ఎందుకంటే, ఇవి చంద్రగుప్త అశోకుల బ్రహ్మాండమైన సామ్రాజ్యానికి ఎదురునిలిచి క్రిష్టియన్ యుగపు తొలిశతాబ్దాలలో కూడ కొనసాగటం జరిగింది. అయితే వీటిలో ఒక్కటికూడ, రోమన్ గణతంత్ర రాజ్యంలాగా దురాక్రమణశక్తిని, యుద్ధవిజయంలో విస్తృతవ్యవస్థా నిర్మాణంలో సామర్థ్యాన్ని, పెంపొందించుకోలేదు. తమ అంతర్గతజీవనాన్ని స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవటంతోనే అవి సంతృప్తిపడ్డాయి అలగ్జాండరు దండయాత్ర తర్వాత, ముఖ్యంగా, భారతదేశం సమైక్యతా ఉద్యమ ఆవశ్యకతను గ్రహించింది. గణతంత్రరాజ్యాలు విభజనకే సహకరించాయి తమవరకు తాము బలం కలవే కాని, చిన్న రాజ్యాల కూటమికి అనువుగాని భారతద్వీపకల్పాన్ని సువ్యవస్థితం చేయటానికి ఏమీ చేయలేకపోయాయి. అటువంటి కృషి ప్రాచీన ప్రపంచంలో ఎక్కడా జయప్రదం కాలేదు. విస్తరణ ప్రయత్నం కొన్ని సంకుచిత పరిమితులు దాటిన తర్వాత భగ్నమై మరింతగా కేంద్రీకృత మవుతున్న ప్రభుత్వదిశగా సాగిన గమనాన్ని తట్టుకోలేకపోయింది. ఇతర చోట్లలో లాగానే భారత దేశంలోనూ, మిగతా రాజకీయ వ్యవస్థా రూపాలన్నింటినీ తోసివేసి దాని స్థానములో రాజరిక రాజ్యం పెరిగి చివరకు పాతుకుపోయింది. భారతదేశ చరిత్ర నుంచి గణతంత్ర వ్యవస్థ అదృశ్యమైపోయింది. నాణాలు, చెదురుమదురుగా దొరికే సూచనలు, గ్రీకు పరిశీలకుల సాక్ష్యాలు, భారతదేశం అంతటా

రాజరిక వ్యవస్థను బలపరచి అది స్థిరపడి అభివృద్ధి కావడానికి తోడ్పడ్డ సమకాలిక రాజకీయ రచయితలు సిద్ధాంతవేత్తలు సమకూర్చిన ఆధారాల వల్లనే నేడు వీటి సంగతి మనకు తెలుస్తున్నది.

దైవశక్తికి ప్రతినిధి, ధర్మ రక్షకుడు అయిన ప్రభువు వ్యక్తిత్వానికి రాజ్యాధికార స్థితికి కొంత పవిత్రతను ప్రామాణికతను సమ్మతించినా, మహమ్మదీయ దండయాత్రలకు ముందున్న భారత రాజరిక వ్యవస్థ, ఏ విధంగా చూసినా వ్యక్తిగత నిరంకుశత్వంగా గాని, అపరిమిత విశృంఖలత్వంగా గాని ఉండేదికాదు ప్రాచీన పర్షియన్ రాజరికంతో, పశ్చిమ మధ్య ఆసియా రాజరికాలతో, రోమన్ సామ్రాజ్యవాద ప్రభుత్వంతో, తరువాత యూరోపియన్ నిరంకుశత్వాలతో దీనికి పోలిక లేనేలేదు. పఠాన్, మొగలు చక్రవర్తి వ్యవస్థకు అది పూర్తిగా భిన్నమైన పద్ధతిలో ఉండేది. భారతీయ ప్రభువుకు తిరుగులేని పరిపాలనా న్యాయ నిర్వహణాధికారాలు ఉండేవి. యుద్ధానికి, శాంతికి తన మంత్రివర్గంతో కలసి అతడొక్కడే బాధ్యత వహించేవాడు. ఇవిగాక సమాజ జీవితం మీద, సంక్షేమం మీద సక్రమ నిర్వహణమీద సాధారణ పర్యవేక్షణ కూడా చేసేవాడు. అయితే అతని అధికారం వ్యక్తిగతం కాదు. పైపెచ్చు అధికార దుర్వినియోగం, పరాధికార ఆక్రమణ జరగకుండా చూసే ఏర్పాట్లు ఉండేవి. ఒకవిధంగా, పాలనా శాసననిర్మాణంలో నియంత్రణలో తనతో సహభాగస్వాములైన ఇతర పౌర అధికారుల, పౌరప్రయోజనాల స్వేచ్ఛలు అధికారాలు సార్వభౌమత్వాన్ని పరిమితం చేసేవి. రాజ్యాంగ నిర్వహణ యంత్రాంగం విధించిన పరిమితి యూరపుచరిత్రలో మనకు సుపరిచితమైన పద్ధతిలో లేకున్నా, వాస్తవానికి అతడు పరిమిత, దేశరాజ్యాంగబద్ధప్రభువు అని చెప్పవచ్చు. మధ్యయుగాల యూరప్‌రాజులకన్న అతని రాజ్యాధికారం నిరంతర ప్రజాభీష్ట అంగీకారాల మీద చాలా ఎక్కువగా ఆధారపడి ఉండేది.

ప్రజాజీవితాన్ని సజీవంగా పాలించే మత. నైతిక, సాంఘిక, రాజ
కీయ, న్యాయ,ఆచార నియమరూపమయిన ధర్మానికి ప్రభువుకన్న ఎక్కువ
సార్వభౌమత్వం ఉండేది. వ్యక్తిసంబంధం లేని ఈ అధికారాన్ని దాని
ఆత్మలో అంగసముదాయంలో పవిత్రంగా శాశ్వతత్వం కలదిగా భావించే
వారు. స్వభావరీత్యా అది ఎప్పుడూ ఒకే విధంగా ఉండేది, సాంఘిక
వికాసం కారణంగా దాని అసలు స్వరూపంలో మార్పులు సజీవంగా స్వతః
సిద్ధంగా వచ్చేవి. ప్రాంతీయాచారాలు, కుటుంబాచారాలు, తదితరాచారాలు
దీనికి సహాయక విధేయాంగాలుగా చేర్చబడేవి; వీటిలో మార్పులు అంత
ర్గతంగా జరిగేవి. ఏ లౌకిక అధికారానికీ ధర్మంలో నిరంకుశంగా జోక్యం
కలిగించుకొనే హక్కు ఉండేది కాదు, బ్రాహ్మణులు ధర్మాన్ని క్రోడీక
రించి ప్రబోధించేవారేగాని సృష్టించేవారు కాదు, ప్రామాణికమైన అభిప్రాయ
ప్రకటనవల్ల ఒక సూత్రాన్నో దాని సూక్ష్మవివరణనో మార్పు చేయటాన్ని
అభిమానించటమో వ్యతిరేకించటమో చేసేవారేగాని వారి ఇష్టానుసారం
ధర్మంలో మార్పు చేసే అధికారం వారికి ఉండేది కాదు. ధర్మాచరణ
జరిగేటట్లు చూచే బాధ్యత వహించి ప్రభువు, ధర్మరక్షకుడు, ధర్మప్రవర్త
కుడు, ధర్మసేవకుడై ధర్మానికి అపచారాలు, అక్రమాలు, ఉల్లంఘనలు
జరగకుండా నివారిస్తూ ఉండేవాడు. తన వ్యక్తిగత జీవితంమీద, ఆచరణ
మీద రాజ్యాధికారపదవిమీద ధర్మం విధించిన కఠోర నియమానికి కట్టుబడి
తానే ముందుగా ధర్మానికి విధేయుడై ఉండేవాడు.

సార్వభౌముడు ధర్మానికి విధేయుడుగా ఉండాలనేది ఆచరణ
యోగ్యం కాని ఆదర్శ సిద్ధాంతం కాదు. సాంఘిక మత – న్యాయం సమస్త
ప్రజా జీవితాన్నీ నియమించేది కనుక అది సజీవ యదార్థంగా ఉండేది.
రాజకీయ క్షేత్రంలోనూ దానికి విస్తృతమైన ఆచరణాత్మక ఫలితా
లుండేవి. అంటే రాజుకు తనకు తానుగా శాసనాన్ని చేసే అధికారం ఉండేది

కాదు. మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక సంవిధానానికి అనుగుణంగా ఉండే సాధికారిక ఆదేశాలను మాత్రం ఇచ్చేవాడు. ఇక్కడ కూడా స్వతంత్రంగా ప్రకటించిన ఆదేశాలను చాటించి అమలుచేసే హక్కులో, రాజుతో పాటు పాలుపంచుకొనే అధికార సంస్థలు ఉండేవి. అంతేగాక తనపరిపాలనా సరళి, స్వభావం, సమర్థ ఫలితాల విషయంలో వెల్లడి అయినా కాకపోయినా ప్రజాభీష్టాన్ని త్రోసిపుచ్చే వీలు ఉండేది కాదు.

సామాన్యుల మత స్వాతంత్ర్యాల విషయంలో సందేహానికి తావు ఉండేది గాదు. దాన్ని ఏ లౌకిక అధికారమూ అతిక్రమించ గలిగేది కాదు. ప్రతి మత సంఘము, కొత్తదైనా చాలా కాలం నుంచి ఉన్నదైనా, ప్రతి మతము, తన జీవన మార్గాన్ని తన సంస్థలను తానే రూపొందించుకొనేది. తమ కార్య రంగాలలో సంపూర్ణ స్వతంత్రులైన అధికారులు, పాలక సంస్థలు వాటికి ఉండేవి. ప్రభుత్వ మత మనేది ఒకటిలేదు; ప్రభువు ప్రజల మతానికి అధిపతి కాదు. అశోకుడు ఈ విషయంలో తన రాజ నియంత్రణాన్ని, లేదా ప్రభావాన్ని విస్తరించే ప్రయత్నం చేసినట్లు కనిపిస్తుంది. శక్తివంతులైన ఇతర చక్రవర్తులు, అప్పుడప్పుడు, స్వల్ప పరిమాణంలో, ఇటువంటి హేయమైన అతిక్రమాలకు పాల్పడేవారు. అయితే అశోకుడు, ధర్మ శాసనాలుగా ప్రకటించినవి సలహా రూపంలో ఉన్నవేగాని విధులు కావు. మత విశ్వాసాలలో గాని, మత సంస్థలలోగాని చక్రవర్తి మార్పులు తేదలచుకుంటే భారతీయ సూత్రానికి అనుగుణంగా దానికి సంబంధించిన ప్రజల అభీష్టాన్ని మన్నించి వారిని సంప్రతించవలసిన బాధ్యతను నెరవేర్చి, గుర్తింపబడిన ప్రామాణికుల అంగీకారాన్ని పొందేవాడు. లేకపోతే ప్రఖ్యాత బౌద్ధ సభలలో లాగా పర్యాలోచన కోసం సలహా మండలికి నివేదించేవాడు లేక వివిధ మత ప్రబోధకుల మధ్య చర్చలను ఏర్పాటు చేసి వారి తీర్పుకు కట్టుబడి ఉండేవాడు. ఒక ప్రత్యేక మత శాఖనో

మతాన్నో ప్రభువు అభిమానించవచ్చు; క్రియాశీలమైన ఈ అభిమానం గణనీయమైన ప్రచార ప్రభావాన్ని కలిగించవచ్చు. కాని అదే సమయంలో తన పదవీ నిర్వహణలో ప్రజల గుర్తింపు పొందిన అన్ని మతాలను కొంత వరకైనా నిష్పాక్షిక దృష్టితో గౌరవించి బలపరచక తప్పదు. బ్రాహ్మణ, బౌద్ధ, చక్రవర్తులు ప్రత్యర్థి మతాలు రెండింటినీ బలపరచటం లోని విశేషాన్ని ఈ నియమం వివరిస్తుంది కొన్ని సమయాలలో, ముఖ్యముగా దక్షిణ దేశంలో ప్రభుత్వాలు నీచమైన హింసా విధానాలకు పాల్పడిన సంఘటనలు ఉన్నాయి అయితే ఈ కల్లోలాల మతోద్రేకాలు ప్రజ్వరిల్లిన సమయంలో సంభవించిన తాత్కాలిక ఆవేశాల వల్ల కలిగిన స్థానికమైన, కొద్ది కాలం మాత్రమే ఉన్న ధర్మోల్లంఘనలు. మామూలుగా మతాలను అణగద్రొక్కటానికి గాని మత అసహనానికి గాని భారత రాజకీయ వ్యవస్థలో స్థానం లేదు; ఈ విధానంలో స్థిరపడ్డ రాజ్య పద్ధతి ఊహించటానికి కూడా వీలులేనిది. ఒకవేళ ఆ విధంగా జరిగిన సందర్భాలలో, సుదీర్ఘకాలం బౌద్ధ ప్రాబల్యం కొనసాగిన తర్వాత ఏర్పడిన అస్తవ్యస్థ స్థితి తర్వాత బెంగాల్‌లో సేన వంశరాజులు వర్ణ వ్యవస్థను తిరిగి క్రమబద్ధం చేసి సంఘటితం చేసినప్పుడు చేసినట్లు, సంబంధించిన వారి అభిప్రాయాన్ని తెలుసుకొనేవారు. సంఘంలో మార్పులు పైనుంచి కృతకంగా కాక లోపల నుంచి స్వతస్సిద్ధంగా వచ్చేవి. తమ జీవన న్యాయాన్ని తామే వృద్ధి చేసుకొనటానికి; మార్పు చేసుకోటానికి, కుటుంబాలకు ప్రత్యేక జాతులకు ఇచ్చిన స్వేచ్ఛ వల్ల ఈ మార్పులు వచ్చేవి.

పరిపాలనా రంగంలో ప్రభువు అధికారం సుస్థాపిత ధర్మసంవిధానం హద్దులలోపల ఉండేది. అతడు పన్ను విధించే హక్కు మీద ముఖ్యమైన ఆదాయ వనరులలో ఒక గరిష్ఠ శాతం ; ఇతర వాటిల్లో, సమాజంలోని వివిధాంశాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న సంస్థలు అభిప్రాయ ప్రకటన చేసే హక్కు ; అతడు పాలించే హక్కు సర్వదా ప్రజల సంతృప్తి సధని

హెచ్చ్రియాలకు లోబడి ఉండాలనే సాధారణ సూత్రం, పరిమితిని విధించేవి. ఇవి ధర్మరక్షకులుగా ఉన్న బ్రాహ్మణుల గొంతెమ్మకోరిక గాని అభిప్రాయం గాని కాదు. వ్యక్తిగా రాజు అత్యుచ్ఛన్యాయస్థానంగా, పౌరచట్టాలను నేరసంబంధమైన చట్టాలను అమలుచేసే అత్యున్నత నియంత్రణగా వ్యవహరించినా, ఇక్కడకూడా అతడు అమలుచేసే పాత్రనే నిర్వహించేవాడు. న్యాయశాసనాన్ని విశ్వాసంతో తన న్యాయాధికారులద్వారా గాని లేదా ఈ విషయంలో పాండిత్యం కలిగిన బ్రాహ్మణ న్యాయశాస్త్ర వేత్తల సహాయముతో గాని అమలు చేయవలసివచ్చేది. విదేశాంగవిధానంలో, సైనిక వ్యవహార నిర్వహణలో, యుద్ధశాంతి విధానాలలో, గొప్ప సంఖ్యలో ఉండే నిర్దేశక కార్యకలాపాలలో మాత్రమే అతనికి సంపూర్ణమైన నిర్బంధరహితమైన నియంత్రణాధికారం ఉండేది. సమాజ సంక్షేమాన్ని, సువ్యవస్థను, పౌరనీతిని. సమకూర్చి పెంపొందించటానికి పనికివచ్చే పరిపాలనాభాగం అంతటా, సార్వభౌమాధికారం అత్యుత్తమంగా క్రమబద్ధంచేసి పర్యవేక్షించగల విషయాలన్నింటితోను, సమర్థమైన ఏర్పాట్లుచేసే స్వేచ్ఛ అతనికి ఉండేది. న్యాయానికి అనుకూలంగా ఉన్నంతమేరకు పోషణకు శిక్షించటానికి అతనికి హక్కు ఉండేది. ఈ హక్కును వినియోగించటంలో సర్వజన ప్రయోజనాన్ని, ప్రజాసంక్షేమాన్ని కచ్చితంగా పరిగణిస్తాడని ఆశించటం జరిగేది.

ఇందుచేత, ప్రాచీన భారత వ్యవస్థలో వికృత నిరంకుశత్వానికి, రాజరిక హింసా ప్రవృత్తికి, అణచివేతకు, సామాన్యంగా అవకాశమే ఉండేది కాదు. కొన్ని ఇతర దేశాల చరిత్రలో సర్వ సామాన్యంగా సంభవించిన పాశవిక క్రూరత్వానికి విశృంఖల నియంతృత్వానికి అంతకంటె అవకాశం ఉండేది కాదు. అటువంటి సంఘటనలు జరిగిన సందర్భాలున్నాయి కాని అవి చక్రవర్తి ధర్మాన్ని తృణీకరించటం వల్లనో, పరి

హిలనా నిర్వహణకు చెందిన ఆదేశాలను ఇచ్చే అధికారాన్ని దుర్వినియోగం చేసినందువల్లనో జరిగి ఉంటాయి. అయితే లిఖితాధారాలున్న అతి దుష్టమైన సందర్భం విదేశీ రాజ వంశానికి సంబంధించినదే. తదితర సందర్భాలలో తాత్కాలిక నిరంకుశ చాపల్యం విజృంభించి, హింస అన్యాయం చాలా కాలం కొనసాగటం జరిగితే అమోఘమైన ప్రజల అసమ్మతికో, తిరుగుబాటుకో ప్రోవతీసేది. అణచివేత రాగల అవకాశాన్ని న్యాయ శాస్త్ర వేత్తలు ముందే ఊహించి ప్రతిక్రియను సమకూర్చారు. చక్రవర్తికి ఎంత పవిత్రతను గౌరవాన్ని ఆపాదించినా, ధర్మాన్ని విధేయుడై వ్రతోఅమలు. చేయటం మానివేస్తే ప్రజలు రాజు పట్ల విధేయతకు కట్టుబడి ఉండనక్కర లేదని నిర్ధారించారు. సిద్ధాంత రీత్యానేకాక ఆచరణలో కూడ రాజును తొలగించటానికి, అసమర్థత, ప్రజలకు సంతృప్తి కలగేట్లు పరిపాలించాలనే నియమాన్ని ఉల్లంఘించటం, ఇందుకు సరిపడిన కారణాలే అయిఉండేవి. న్యాయ రహితుడై బలాత్కారం నిరంకుశత్వం సాగించి, రాజును ప్రజలు పిచ్చి కుక్కను కొట్టి చంపినట్లు చంపివేయాలని మనువు నిర్ణయించాడు. తిరుగుబాటును, రాజ హత్యను, తీవ్రమైన సందర్భాలలో సమర్థిస్తున్న ఈ అత్యున్నత ప్రమాణం, భారత రాజకీయ వ్యవస్థలో, నిరంకుశత్వం గాని రాజుకు అంతులేని దేవుడిచ్చిన హక్కు గాని భాగం కాదని చెప్పటానికి చాలు, నిజంగా ప్రజలు ఈ హక్కును వినియోగించినట్లు చరిత్ర సాహిత్యాలు రెండిటిలోనూ కనిపిస్తుంది. సర్వ సాధారణంగా అవలంబించిన మరింత శాంతియుత నివారణోపాయం విడిపోతామనే బెదిరింపు లేక సామూహికంగా వలసపోవటం. అపరాధి అయిన పాలకుడు త్రోవకు రావటానికి చాలా సందర్భాలలో ఇది సరిపోయేది. చాలా ఇటీవలి కాలంలో పదిహేడవ శతాబ్దంలో దక్షిణ దేశంలో ప్రజాదరణ కోల్పోయిన రాజును విడిపోతామని బెదిరించటమే గాక ఆ రాజుకు చేసిన ఏ సహాయమైనా దేశ

ద్రోహ చర్యగా ప్రజాసభ బహిరంగంగా నిందించటం జరిగింది. మంత్రి మండలి గాని ప్రజా సభలు గాని అతణ్ణి పదవీచ్యుతుణ్ణి చేయటం ఇంకా సర్వ సామాన్యమైన చికిత్స. ఈ విధముగా ఏర్పడిన రాజరిక వ్యవస్థ పర్యవసానంలో సరసమైన, సమర్థమైన, లాభదాయకమైన విధానంలో, తనకు అప్పగించిన ప్రయోజనాలను చక్కగా నెరవేర్చి ప్రజల ప్రేమను నిరంతరం చూరగొంటూ ఉండేది. భారతీయ సాంఘిక - రాజకీయ వ్యవస్థలో, రాజరికం. ఆమోదించబడిన ఒక ముఖ్యమైన అంశమేగాని తప్పనిసరి అంశం కాదని ప్రాచీన గణతంత్ర సంస్థల ఉనికివల్ల తెలుస్తున్నది రాజరిక దృశ్యరూపాన్ని మాత్రమే చూసి దానివెనుక ఉన్నదానిని చూడకపోతే, ఈ వ్యవస్థ నిజమైన సూత్రం బోధపడదు. ఈ నిర్మాణ సమస్త సారభూత స్వభావం మనకు కనిపించేది అక్కడనే.



# 2

భారత రాజకీయ వ్యవస్థ నిజ స్వభావాన్ని గ్రహించాలంటే దానిని ప్రత్యేక వస్తువుగా, ప్రజా మనో జీవనాలకు సంబంధం లేని యంత్రాంగంగా కాక సర్వసజీవ సాంఘికస్థితిలో భాగంగా దానికి సంబంధించినదిగా చూడవలసి ఉంటుంది.

ఒక ప్రజా సముదాయం, ఒక మహా మానవ సామూహికత నిజానికి ఒక సామూహిక (సామూహిక శబ్దం అంతరంగ వాస్తవికతను ప్రతిబింబించ లేనంతగా యాంత్రికమై పోయింది) ఒక సామాన్య సామాజిక ఆత్మ, మనో శరీరాలతో కూడిన ఒకానొక సజీవ సావయవస్థితి. మానవ వ్యక్తి భౌతికజీవితం లాగానే సంఘజీవితం కూడ జన్మ, వృద్ధి యవ్వన, ఫలన, క్షీణతల ఆవృత్తి గుండా సాగిపోతూ ఉంటుంది. ఈ చివరి దశ, ఎక్కడా ఆగకుండా, చాలా దూరం పతనావస్థ వైపుగా పోయినప్పుడు, మనుష్యుడు వృద్ధాప్యం వల్ల చనిపోయినట్లు, అది నశించి పోవచ్చు. భారత చైనా దేశాలు తప్ప మిగిలిన ప్రాచీన ప్రజా సముదాయాలు, జాతులు అన్నీ ఈ విధంగానే నశించిపోయినాయి. కాని తన్ను తానే పునరుజ్జీవింపచేసుకొని, తిరిగి యథాపూర్వంగా ఆవృత్తిని పొందగల సామర్థ్యం కూడ, సామూహిక స్థితికి ఉంటుంది. ప్రతి ప్రజాసముదాయంలో ఒక ఆత్మ భావన (Soul idea) లేదా జీవ భావన (Life-Idea) పరివర్తిస్తూ ఉంటుంది. దాని శరీరం అంతగా ఇది శాశ్వతమైనది కాదు. ఈ భావన తగినంత శక్తివంతంగా విస్తారంగా, తీవ్ర బలప్రదంగా ఉండి ప్రజలు తగినంతగా బల సంపన్నులు శక్తివంతులు, స్థిరత్వంలో నిరంతర విస్తృతిని, లేక తమ ఉనికి లోని ఆత్మ భావ, జీవ భావ శక్తుల వినూత్న

అనువర్తనాన్ని సంయోగపరచగలిగే మృదుత్వాన్ని మనస్సులో స్వభావంలో కలిగినవారు అయి ఉన్నప్పుడు, తన శక్తి చివరకు ఉడిగి పోయే ముందుగా ఈ భావన అనేక అవ్రుత్తులను గడిచిపోవచ్చు. అదీగాక ఈ భావన సామాజిక స్థితి తన ఆత్మను అభివ్యక్తం చేసే సూత్రమే. మళ్ళీ ప్రతి సామాజిక ఆత్మ. కాలంలో అభివ్యక్తం అవుతూ ఒడుదుడుకుల ద్వారా మానవ జాతిలో స్వయం పూర్ణతను అన్వేషిస్తున్న ఒక మహా శాశ్వత చైతన్యానికి ఉపకరణం, వ్యక్త రూపం. తన భౌతిక జీవితం లోనే కాక తన అభివృద్ధిలో మార్పులను సైతం నియమిస్తూ తన మనస్తత్వానికీ స్వభావానికీ కీలకమైన జీవభావన లేక ఆత్మ భావనలోనో దాని శక్తి లోనో కూడ మాత్రమేగాక దాని వెనుక ఉన్న ఆత్మ చైతన్యాలలో ప్రజా సముదాయం తెలిసి నివసించటం నేర్చుకొంటే అది క్షీణతకు లోను కాదు. అది అదృశ్యం కావటం, నాశనం కావటం, ఇతర ప్రజాసముదాయాలలో విలీనమై పోవటం, కొత్త జాతికో ప్రజాసముదాయానికో తావివ్వటం జరగక పోవచ్చు. మొదటి నుంచీ ఉంటున్న అనేక స్వల్ప ప్రజా సముదాయాలను తానే తన జీవితంలో విలీనం చేసుకొని అత్యున్నత సహజ వృద్ధిని సాధించి, బహు పునరుజ్జీవాల గుండా మృతి ఎరుగక సాగిపోవచ్చు.

మనుష్యుడు నిజమైన తన ఆధ్యాత్మిక వ్యక్తిత్వాన్ని అన్వేషించటం ఈ అన్వేషణకు కావలసిన నిర్మాణంగా, సాధనంగా అజ్ఞాన సహజ స్థితి నుంచి ఆధ్యాత్మిక చైతన్య స్థితికి అతడు ఊర్ధ్వ గమనం చేయటం కోసం, మొదట అతని నిమ్న భౌతిక, ప్రాణిక, మానసిక స్వభావం పొందే ఆవశ్యక పరిణామం ఆధారంగా జీవితాన్ని ఉపయోగించుకోవడం, భారత ప్రజల జీవితాన్ని సంస్కృతిని, సాంఘికాదర్శాలను నియంత్రించిన ప్రముఖ భావన. ఒత్తిళ్ళకు భౌతిక అత్యవసర పరిస్థితులకు లోనైనప్పుడు గాని, రాజకీయ, సాంఘిక నిర్మాణానికి చెందిన బాహ్య విషయాలలో గాని భారతదేశం ఈ ప్రబల భావాన్ని ఏనాడూ విడిచిపెట్ట లేదు. మానసిక, మత, ఆలోచనా, కళా, సాహిత్యాంశాల ద్వారా కన్న

సామాజిక జీవితం ద్వారా తనలోని ఉన్నత ఆత్మానుభవాన్ని, మానవుని నిజమైన ఆత్మ చైతన్యం ప్రకటించటం ఎంతో గొప్ప కష్టం. ఆ రంగాలలో భారతదేశం అసాధారణ ఉన్నతిని విస్తృతిని సాధించినప్పటికీ బాహ్య జీవితంలో మాత్రం, చాలా పాక్షికమైన అనుభవాలు కొన్నింటిని, చాలా అసంపూర్ణ ప్రయోగాత్మక ప్రతిపాదనలను—అంటే ఒక సాధారణ ఆధ్యాత్మిక ప్రతీక విధానం ఒక గొప్ప ఆకాంక్షా వ్యాపనం, సామాజిక జీవితాన్ని ఒక మూసలో పోయటం - మించి ముందుకు పోలేకపోయింది.

మానవలక్ష్యంలో ప్రవర్తనలో మొదటి రెండు స్థూలభాగాలుగా భారతీయవ్యవస్థ గుర్తించిన స్వలాభాపేక్ష, సుఖవాంఛలకు, రాజకీయాలు, సంఘము, ఆర్థికస్థితిగతులు, సహజరంగాలు. ఉన్నత ధర్మసూత్రం ఈ బాహ్యజీవితంలో ఎక్కడయినా పాక్షికంగానే ప్రవేశించింది. రాజకీయ చర్యలు నైతిక నియమానికి లోను కావటం ఒక నటన మాత్రమే కాబట్టి ఈ ధర్మం రాజకీయాలలో కనిష్ఠ ప్రమాణంలో మాత్రమే వచ్చింది. బాహ్యజీవితంతో మోక్షానికి సమన్వయం లేదా ఏకత్వం అనే భావన రూపొందటంగాని అ ప్రయత్నంగాని దాదాపు జరగనే లేదు. ఇంకా యుక్తవయస్సురాని మానవజాతి గతచరిత్రలో ఇది జయప్రదం కావడం అసలే జరగలేదు. కాబట్టి భారతదేశ అర్థిక సాంఘిక జీవనపాలనను, రాజకీయ జీవితపాలనను - మిగిలిన రంగాలలోకన్న తొందరగా ఈప్రయత్నం భగ్నం అయిపోయినా — వ్యవస్థను, అస్తిత్వ గమనదిశను నియత్రించటంలో, పరోక్షంగా ఆధ్యాత్మిక ప్రాముఖ్యతను ఆచ్ఛాదనం చేయటంవరకే ధర్మం ప్రాచీన వ్యవస్థలో వ్యవహరించ గలిగింది. ఆధ్యాత్మిక జీవిత సంపూర్ణసాధన, ఒక మహోత్కృష్టలక్ష్యంగా వ్యక్తిప్రయత్నానికే వదలివేయటం జరిగింది. ఈపాటి కృషినైనా పట్టుదలతో, సహనంతో నిర్వహించి, తన సాంఘిక రాజకీయ వ్యవస్థకు, భారతదేశం, ఒక చిత్రమైన

ఆకారాన్ని సమకూర్చింది. బహుశః భావిభారతదేశం తన ప్రాచీన పవిత్ర కర్తవ్యాన్ని స్వీకరించి, మరింత పూర్ణలక్ష్యంతో, మరింత సమగ్ర అనుభవంతో, జీవిత ఆత్మ చైతన్యాలను సమన్వయపరచగల మరింత నిశ్చిత జ్ఞానంతో విస్తృతం చేసి, గంభీర ఆధ్యాత్మిక సత్యానుభవంమీద, ఇంత వరకు అనుభవంలోకి రాని మనఃస్థితిలోని ఆధ్యాత్మిక సంభావ్యతలమీద, మానవుని సామూహిక స్థితి స్థాయిని చర్యను నిలబెట్టి, ఒక సామాజిక ఆత్మ, విశ్వ చైతన్య శరీరమైన "విరాట్" మానవజాతి మహావ్యక్తిత్వ లీలగా ప్రజల జీవితం రూపొందేటట్లు ఆత్మవంతం చేయవలసి ఉంటుంది.

ప్రాచీన భారత రాజకీయ వ్యవస్థ యూరోపియన్‌జాతుల రాజకీయ వ్యవస్థకు భిన్నంగా ఉండేటట్లు, మనఃస్థితికి, అంతర్గత సంస్కృతికి అనువర్తించని పాశ్చాత్య ప్రమాణాలు రాజకీయ వ్యవస్థకు గూడ అంతగా సరిపోనట్లు చేసిన మరొక అంశాన్ని ఇక్కడ గమనించాలి. తన సంభావ్యతలు పరిపూర్ణం అయ్యేస్థితిని చేరుకొనేముందు మానవ సమాజాభివృద్ధి మూడు పరిణామదశల్లో జరగవలసి ఉంటుంది. మొదటిది, సామాజిక జీవితరూపాలు కార్యకలాపాలు, శక్తులు, సూత్రాలు స్వచ్ఛందంగా వర్తించటానికి సంబంధించిన స్థితి. దాని సమస్త వృద్ధి, దాని రూప కల్పనలన్నీ, ఆచారాలు, సంస్థలు అన్నీ ఒక సహజ సజీవవికాసం అవుతాయి. దాని ప్రేరేపణ నిర్మాణశక్తులు, అంతర్గతంగా ఉన్న దాని అధోమానసిక జీవితసూత్రం నుంచే చాలవరకు వస్తాయి అది సామాజిక మనస్తత్వాన్ని, స్వభావాన్ని, ప్రాణిక భౌతికావశ్యకతను ఉద్దేశరహితంగా ప్రకటిస్తూ, అంతర్గత ప్రేరేపణల ఒత్తిడిక్రింద కొంతవరకు, సామాజిక మనోస్వభావాలమీద ప్రభావం కలిగిన పరిసరాల ఒత్తిడిక్రింద కొంతవరకు, పట్టువదలక కొనసాగుతూనో, మార్పు చెందుతూనో ఉంటుంది. ప్రజాసముదాయం ఈ దశలో ఇంకా ఎరుకగల స్వయంజ్ఞానాన్ని పొందలేదు. ఆలోచించగలిగిన సామూ

హిక జీవిగా అది ఇంకా రూపొందలేదు. తన సామాజిక జీవితాన్నంతటినీ నియంత్రిస్తున్నది హేతుపూర్వకి ఇచ్ఛ కాక పోవటంవల్ల, ప్రాణాధారమైన సహజ ప్రవృత్తులనో వాటి పూర్వ మనోరూపాలనో అనుసరిస్తూ జీవిస్తుంది. చాలా ప్రాచీన మధ్యయుగాల సమాజాలలాగానే, భారతీయసమాజ రాజకీయ వ్యవస్థల తొలిరచన ఆటువంటి దశలోనే వృద్ధి పొందింది. కాని సాంఘిక స్వయంజ్ఞానం పెరుగుతూ వచ్చిన తరువాతి యుగంలో వీటిని తిరస్కరించక, ఇంకా విస్పష్ట రూపకల్పన చేసి, వృద్ధిచేసి, వ్యవస్థీకృతం చేసి, కేవలం రాజకీయవాదుల, శాసనకర్తల, సాంఘిక – రాజకీయ సిద్ధాంత వేత్తల నిర్మాణంగా కాక భారతప్రజల మనఃస్థితికి అంతర్బుద్ధికి, సహజ ప్రవృత్తులకు సహజసిద్ధమయిన, దృఢము శక్తివంతము అయిన వ్యవస్థగా రూపొందింది

ద్వితీయ దశలో, సామాజిక మనఃస్థితి, అధికాధిక మేధాశక్తితో కూడిన స్వయం జ్ఞానాన్ని, మొదట అధిక సంస్కృతిపరులలో తరువాత జన సామాన్యంలో, మొదట స్థూలంగా, తరువాత తన జీవన భాగాల సూక్ష్మాంశాలలో, పొందుతుంది. అభివృద్ధి చెందిన ప్రజ్ఞా ప్రకాశంలో చివరకు విమర్శనాత్మక నిర్మాణాత్మక హేతుజ్ఞానం వల్ల తన జీవితాన్ని, సామాజిక స్వభావాలను, అవసరాలను, సంస్థలను సమీక్షించి వాటితో వ్యవహరించటం నేర్చుకొంటుంది. గొప్ప సంభావ్యతలు నిండి ఉన్నా, అత్యంత ప్రమాద భూయిష్ఠమైన దశ ఇది. దీనివల్లకలిగే మొదటి ప్రయోజనాలు స్పష్టమైన అవగాహనతో కూడిన, కచ్చితమైన శాస్త్రీయ విజ్ఞానం పెరగటం వల్ల వచ్చేవే. కచ్చితమైన, సురక్షితమైన సామర్థ్యం పెంపొంది పూర్తిగా ఉపయోగానికి వచ్చిన విమర్శనాత్మక నిర్మాణాత్మక శాస్త్రీయ హేతుబుద్ధి ప్రతిఫలంగా, పర్యవసానంగా చరమ ఘట్టంలో లభిస్తుంది. మనుష్యుడు తన ప్రాణిక స్థితి పరిమితులను, ఆరంభ సాంఘిక, ఆర్థిక,

రాజకీయ ఆవశ్యకతలను, వాంఛలను అధిగమించి, అలవాటుపడ్డ మూస లలో నుంచి తప్పించుకొనేటట్లు, ఉన్నత సముజ్జ్వల ఆదర్శాల ఆవిర్భా వాన్ని, ఇతోధికంగా అదర్శప్రాయ మవుతున్న సమాజాన్ని అనుభవం లోకి తేగలిగిన కార్య రంగాన్ని గోచరింపచేసే సామాజిక జీవితంతో ధైర్యంగా ప్రయోగాలు చేసేటట్లు, ప్రేరేపించే స్ఫూర్తి ఈ సాంఘిక పరి ణామ దశలో లభించే మరొక గొప్ప ఫలితం. శాస్త్రీయ మనఃస్థితిని, సాధా రణంగా దానివల్ల కలిగే కచ్చితము, నిర్దుష్టము, సురక్షితము అయిన సామ ర్థ్యంతో జీవితానికి అనువర్తింపచేయటం; తెలిసి ప్రతిపాదించిన గొప్ప సాంఘిక రాజకీయ అదర్శాలను అనుసరించటం; చేసిన కృషిని సూచిస్తూ జరిగిన అభివృద్ధి-ఇవి, పరిమితులు లోపాలు ఏవైనా, యూరప్ రాజకీయ సాంఘిక కృషివల్ల లభించిన విశిష్ట ప్రయోజనాలు.

దీనికి విరుద్ధంగా, హేతుబుద్ధి జీవిత మూల పదార్థాలతో నిరంకుశ పాలకుడుగా వ్యవహరిస్తే, సహజ వాస్తవికతను ఒక సజీవ వృద్ధిగా కాక, తనకు తోచినట్లు మన ప్రజ్ఞ ఇచ్చే ఆదేశాల ననుసరించి ఇష్టానుసారం, నిర్జీవ పదార్థాలను స్వలాభం కోసం వాడుకొని నిర్మాణాలు చేయటానికి అనువైన యంత్ర వ్యవస్థగా పరిగణించటం జరుగుతుంది. కృత్రిమ సూక్ష్మ కల్పనలు చేస్తూ, పరిశ్రమిస్తూ, సమర్థంగా యాంత్రికంగా వ్యవ హరించే హేతు బుద్ధి, ప్రజా సముదాయానికి సంబంధించిన సరళ సూత్రా లనే గ్రహించలేకపోతుంది. జీవశక్తి నిగూఢ మూలాలను దాని జీవితా న్నుంచి తెంచివేస్తుంది. దీనివల్ల లభించె ఫలితం: పద్ధతుల మీద, సంస్థల మీద, శాసన నిర్మాణం మీద, పరిపాలన మీద మితిమీరి ఆధారపడటమేగాక జీవంతో తొణికిసలాడే ప్రజా సముదాయం స్థానంలో ఒక యాంత్రిక రాజ్యం రూపొందగల భయానక ప్రవృత్తి ఏర్పడటం. సామాజిక జీవ నానికి సాధనంగా ఉండవలసినది జీవితాన్ని నెట్టివేసి తానే ఆ స్థానాన్ని

ఆక్రమించటానికి ప్రయత్నించటంతో, శక్తివంతమైనా యాంత్రికము, కృత్రిమము అయిన నిర్మాణమే సృష్టి అవుతుంది. స్వేచ్ఛా జీవశక్తులతో నిండిన ప్రజా సముదాయ శరీరంలో సజీవ స్వయం వికసనం పొందే సామాజిక ఆత్మకు చెందిన జీవిత సత్యాన్ని నష్టపోవటమే ఈ బాహ్య లాభానికి చెల్లించవలసిన మూల్యం. ప్రాణిక, ఆధ్యాత్మిక, సహజ ప్రవృత్తులను యాంత్రిక విధాన దుర్భర భారంతో ఊపిరి సలపనీయని విజ్ఞాన శాస్త్ర హేతుబుద్ధి చేసిన పొరపాటు యూరప్ బలహీనతగా పరిణమించి, దాని ఆకాంక్షలనువంచించి అది ఉన్నతాదర్శ సత్యానుభవస్థితిని చేరకుండా నిరోధించింది.

సామూహిక సంఘస్థితిగాని, మానవ వ్యక్తిస్థితిగాని, వికాసక్రమంలో మూడవదశకు చేరినప్పుడు మొట్టమొదట మానవుని ఆలోచనలు స్వాధీన పరచుకొని అనుసరించిన ఆదర్శాలు తమ నిజమైన మూలాన్ని, స్వభావాన్ని తమ నిజమైన సాధనాలను అవి సఫలం కాగల పరిస్థితులను కనుగొంటాయి. అలా లేకపోతే మెరిసే మబ్బులమీది ఛాయాదృశ్యంగా పరిపూర్ణ సమాజం తనవెనుక పరుగులు పెట్టిస్తూ మన ఆశయాలను భంగపరచి మన చేయి జారిపోతుంది. సామూహిక స్థితిలో ఉన్న మానవుడు లోతైన జీవితాన్ని కలిగి ఉన్నప్పుడు, తన సామూహికజీవితాన్ని ప్రధానంగా ప్రాణిక ఆత్మనుంచి వెల్లుబికివచ్చే ఆవశ్యకతలు సహజ ప్రవృత్తులు అంతర్బుద్ధులద్వారా గాని లేదా హేతుబుద్ధిచేసే నిర్మాణాలద్వారా కాని కాకుండా ప్రథమంగా, ప్రముఖంగా సర్వదా వ్యక్తి సమాజ అస్తిత్వాలు స్వేచ్ఛ పరిపూర్ణ, ఏకత్వ న్యాయంతో కూడి తనలో బయల్పడిన మహావ్యక్తిత్వ ఆధ్యాత్మిక చైతన్యాల ఏకత్వ, సహానుభవ, స్వచ్ఛందస్వేచ్ఛ మృదు సజీవ వ్యవస్థశక్తిద్వారా నియంత్రించుకొన్నప్పుడు ఈ దశ వస్తుంది. ఈ సూత్రం తన ప్రయత్నాన్ని ప్రారంభించటానికిగూడ సరిపడని పరిస్థితులు

కనిపించటం లేదు. ఆధ్యాత్మిక స్థితి సూత్రాన్ని చేరి దానికి కట్టుబడి ఉండటం కోసం మనుష్యుడు చేసే ప్రయత్నం వ్యక్తులకు మాత్రం వర్తించే అసామాన్య లక్షణం కాక, దానిపట్ల సర్వసాధారణంగా కలిగిన ఆకాంక్ష జనాకర్షక మతంగా భ్రష్టం కానప్పుడే అది రాగలదు. తన అస్తిత్వానికి, నిజమైన సరియైన విధంగా దాన్ని సంపాదించటానికి అనివార్య అవశ్యకతగా జాతిక్రమవికాసంలో రాబోయే ఘట్టంగా గుర్తించి, చివరివరకు అవలంబించినప్పుడు అది సంభవం అవుతుంది.

తొలినాటి చిన్న చిన్న భారతదేశ జాతులు, తమ ప్రవర్తనా ప్రవాహాన్ని, మార్గాన్ని, సహజంగా, స్వేచ్ఛగా తెలుసుకుంటూ, సమాజస్థితికి చెందిన ప్రాణిక అంతర్బుద్ధి స్వభావాలనుంచి జీవితరూపాన్ని సాంఘిక రాజకీయ వ్యవస్థను వెలువరస్తూ, ఇతర జాతులవలెనే, శక్తివంతము స్వచ్ఛందము అయిన జీవశక్తితో కూడిన మొదటిదశద్వారానే అభివృద్ధి పొందాయి. అవి ఒకదానిలో ఒకటి కలిసిపోయి, వృద్ధి అవుతున్న సాంస్కృతిక, సాంఘిక ఏకత్వంగా వర్ధిల్లి, పెద్ద పెద్ద రాజకీయ సంస్థలుగా రూపొందుతూ అంత ముఖ్యంగాని విధానంలోగాని రూపంలోగాని వైవిధ్యాన్ని పొందే గొప్ప స్వేచ్ఛను అనుమతించే ఒక సామాన్య చైతన్యాన్ని, సామాన్య మూలాధారాన్ని, ఒక సాధారణ ఆకృతి నిర్మాణాన్ని పెంపొందించాయి. కర్కశమైన ఏకత్వంతో నిమిత్తం లేదు; ఈ మృదుత్వం మీద సాధారణ ఏకత్వాన్ని విధించటానికి సామాన్య ఆధ్యాత్మిక చైతన్యం, జీవిత ప్రేరణ సరిపోతాయి. మహా రాజ్యాలు, సామ్రాజ్యాలు విస్తరించినప్పుడు కూడ చిన్న రాజ్యాలు, గణతంత్ర సంస్థలు, జాతులు మొదలైన విలక్షణ సంస్థలను సాంఘిక రాజకీయ నిర్మాణపు కొత్త మూసలో చేర్చటం జరిగిందే గాని నాశనం చేయటం గాని ప్రక్కకు నెట్టివేయటం గాని జరగలేదు. ప్రజా సముదాయ సహజ వికాసంలో నిలవలేక పోయింది, అవసరం తీరి

పోయిందీ ఏదైనా ఉంటే అది తనంతట తానే కృశించిపోయి మూలపడేది కొత్త పరిస్థితులకు, వాతావరణానికి అనువుగా మారగలిగిందైతే నిలువగలిగేది; భారత ప్రజల స్థితికి చెందిన ఆధ్యాత్మిక ప్రాణిక సూత్ర స్వభావాలతో సరిపడిందేదైనా విశ్వజనీనమై, సంఘ రాజకీయ వ్యవస్థ శాశ్వత రూపంలో సముచిత స్థానాన్ని ఆక్రమించేది.

వృద్ధి అవుతున్న మేధా సంస్కృతీ యుగం ఈ స్వచ్ఛంద జీవిత సూత్రాన్ని గౌరవించింది. సంఘ ఆర్థిక రాజకీయ స్థితి గతులనుగురించి ఆలోచించిన భారతీయ మేధావులు – ధర్మ అర్థ శాస్త్రజ్ఞులు సంఘ ప్రభుత్వ ఆదర్శాలను వ్యవస్థలను ఆచరణ యోగ్యంగాని బుద్ధితో నిర్మించలేదు, అదివరకే సామాజిక మనఃస్థితి జీవితము పెంపొందించిన సామాజిక జీవిత విధానాలను, సంస్థలను, ఆచరణాత్మక హేతుబుద్ధిని ఉపయోగించి అవగాహన చేసుకొని నియంత్రించటం; మొదటినుంచీ ఉంటున్న అంశాలను నాశనం చేయక వాటిని అభివృద్ధిచేసి, స్థిరపరచి, సామరస్య స్థితిలో ఉంచటం వారు తమ పనిగా పెట్టుకొన్నారు. కొత్త అంశం భావం ఏదైనా అవసరమైనప్పుడు దానిని ఉపరితల నిర్మాణంగా కాక మార్పు కలిగించే సూత్రంగానే గాని, విప్లవాత్మక వినాశకర సూత్రంగా ప్రవేశపెట్టలేదు, పూర్తిగా మునుపటి దశల నుంచే రూపుదిద్దుకున్న రాజరిక వ్యవస్థలో ఈ విధంగానే పరిణామం జరిగింది. అప్పటికే ఉన్న సంస్థలను రాజు లేక చక్రవర్తి సార్వభౌమ నియంత్రణ క్రిందకు తీసికొని రావటం ద్వారా అది సాగిపోయింది. రాజరిక వ్యవస్థతో సామ్రాజ్య వ్యవస్థనో పైనుంచి విధించటం వల్ల ఆ సంస్థలలో చాలా వాటి స్వభావం, అంతస్తు మార్పుకు లోనైనాయి. అయితే సాధ్యమైనంతవరకు అంతరించిపోకుండా అవి ఉండగలిగాయి. ప్రాచీన, ఆధునిక యూరప్ ప్రముఖ లక్షణం అయిన వైజ్ఞానిక ఆదర్శయుత రాజకీయాభ్యుదయం గాని విప్లవాత్మక ప్రయోగం

గాని, ఈ కారణం వల్లనే భారతదేశంలో కనిపించవు. భారతీయ మనో జీవితాల సహజ ప్రకటనగా, ధర్మ అభివ్యక్త రూపంగా గతంలో జరిగిన కల్పనల పట్ల అపార గౌరవాన్ని కలిగి ఉండటం, మానసిక దృక్పథంలో అత్యంత దృఢమైన ఒక అంశంగా ఉండేది. ఉన్న వాటిని కాపాడుకోవాలనే ఈ సహజప్రవృత్తి ఉన్నత వైజ్ఞానిక మహా యుగంలో కూడా చెక్కు చెదరలేదు సరిగదా ఇంకా దృఢంగా స్థిరంగా నిలిచిపోయింది స్థిర వ్యవస్థా సూత్రాన్ని, రాజకీయ సాంఘిక దృష్టాంతాన్ని, అప్పటికే నిలదొక్కు కొన్న రచనను నిర్మాణాన్ని భద్రపరచుకొంటూ ఆచారం, వ్యవస్థ మెల్లగా అభివృద్ధి కావటం ఒకటే సంభవము స్వీకార యోగ్యము అయిన అభ్యుదయ మార్గంగా ఉండేది. దీనికి విరుద్ధంగా, యూరోపియన్ నాగరికతను పీడిస్తూ ఈనాడు ఉద్యోగి వర్గ పారిశ్రామిక రాజ్య రూపంలో భయంకర కృత్రిమ నిర్మాణంగా పరిణమించి, ప్రజా జీవిత వ్యవస్థ సహజ స్థితికి బదులు యాంత్రిక వ్యవస్థను ప్రవేశ పెట్టే వ్యాధికి భారత రాజకీయ వ్యవస్థ గురి కాలేదు. దీనివల్ల ఆదర్శాత్మక మేధాశక్తి వల్ల ఒనగూడే ప్రయోజనాలు సిద్ధించక పోయినా, యాంత్రిక హేతువాద ప్రజ్ఞవల్ల కలిగే అనర్థాలూ కలగలేదు.

హేతువాదప్రజ్ఞను పెంపొందించేటప్పుడు కూడా భారతీయ మనః స్థితికి అపారమైన అంతర్బుద్ధి కలిగి ఉండటమే అలవాటుగా ఉండేది. హేతుబుద్ధి ప్రకాశం మధ్యవర్తిగా, క్రమబద్ధంచేసి నియంత్రించే అంశంగా వ్యవహరిస్తూ ఉండగా, జీవిత అంతర్బుద్ధులను చైతన్య అంతర్బుద్ధులను సంయోగపరచే ప్రయత్నంగా దాని ఆలోచనాపద్ధతి ఉండేది. స్థిరమైన దృఢమైన జీవితవాస్తవాలమీద పటిష్ఠంగా నిలబడటానికి, తన ఆదర్శాను సరణంకోసం మేధాశక్తిమీద కాక చైతన్యప్రకాశంమీద అంతఃస్ఫూర్తి మీద - ఉన్నత ఆత్మానుభవాల మీద - ఆధార పడటానికి ఆది

ప్రయత్నం చేసింది : తాను వేసే అడుగులను పరీక్షించి నిశ్చయించే విమర్శనాశక్తిగా, ఎల్లప్పుడూ నిజమైన, దిట్టమైన నిర్మాతలుగా ఉండే జీవిత ఆత్మచైతన్యాలను ఆక్రమించకుండా సహాయపడేటట్లుగా హేతు బుద్ధిని అది ఉపయోగించుకొన్నది. భారతదేశ ఆధ్యాత్మిక మనఃస్థితి జీవి తాన్ని ఆధ్యాత్మిక వ్యక్తిత్వ అభివ్యక్తరూపంగా పరిగణించింది. సమాజం సృష్టికర్త అయిన బ్రహ్మశరీరం ; ప్రజాసముదాయం సమిష్టిలోని బ్రహ్మ జీవశరీరం అంటే సమిష్టి నారాయణుడు ; వ్యక్తి వ్యష్టిలోని బ్రహ్మ, ప్రత్యేక జీవుడు - వ్యక్తిగత నారాయణుడు ; రాజు జీవంతో ఉన్న దైవ ప్రతినిధి కాగా సమాజంలోని తక్కిన వర్గాలు సామూహిక వ్యక్తిత్వానికి చెందిన సహజశక్తులు (ప్రకృతయః). అందరూ అంగీకరించిన సాంప్ర దాయాలు, సంస్థలు, ఆచారాలు, సాంఘిక రాజకీయ వ్యవస్థ అన్ని భాగాల లోని నిర్మాణవిధానం, నిర్బంధించె అధికారాన్నే కాదు, నిస్సందేహమైన పవిత్రతా స్వభావాన్ని కూడ కలిగి ఉండేది.

వ్యక్తి తన స్వధర్మాన్ని, తన స్వభావానికీ చెందిన నిజమైన న్యాయ ప్రమాణాలను విశ్వాసంతో అనుసరించటంతో పాటు, తన వంటి స్వభావం కలవారు – సమూహ స్థితి సామూహిక జీవితం కూడా – అదే విధంగా ప్రవర్తించటం వల్ల మానవ, విశ్వ జీవితాల సక్రమ విధానాన్ని పరిరక్షించటం జరుగుతుందని ప్రాచీన భారతీయ భావం. కుటుంబం, కులం, వంశం, వర్గం, సాంఘిక మత పారిశ్రామిక తదితర సమాజాలు, జాతి, ప్రజా సముదాయం-వీరందరూ తమ స్వధర్మాన్ని తామే రూపుదిద్దు కొనే సజీవ సామూహిక స్థితులు. ఈ ధర్మానుసరణమే తమ పరిరక్షణకు, ఆరోగ్యకరమైన అవిచ్ఛిన్నతకు దృఢచర్యకు కావలసిన అనుకూల పరిస్థితి, పరిస్థితి, పరిసరాలు, యుగం విధించే యుగ ధర్మం-విశ్వజనీన నైతిక మత ధర్మం-ఉన్నట్లుగానే స్థితికి, విధికి, ఇతరులతో ప్రత్యేక సంబంధానికి

వర్తించే ధర్మం కూడా ఉన్నది. ఇవన్నీ సహజ ధర్మాన్ని-స్వభావాన్ని అనుసరించిన చర్యను- ప్రభాషితం చేసి న్యాయ స్వరూపాన్ని స్పష్టిస్తాయి. మనుష్యుని వ్యక్తిగత సామూహిక స్థితి పూర్తిగా సవ్యంగా పటిష్ఠంగా ఉన్నప్పుడు-పురాణాలలో స్వర్ణ యుగం, సత్య యుగం వంటి పరిస్థితిలో- రాజకీయ ప్రభుత్వం గాని, రాజ్య వ్యవస్థ గాని, కృత్రిమ సంఘ నిర్మాణం గాని అవసరం లేదని ప్రాచీన సిద్ధాంతం భావించింది. ఎందుకంటే అప్పుడు తమ జ్ఞాన వ్యక్తిత్వానికి, దైవ నివాసమైన తమ స్థితికి చెందిన సత్యాన్ని తమ అంతర్గత దివ్య ధర్మాన్ని అనుసరించి అందరూ స్వేచ్ఛగా జీవిస్తారు. అందుచేత, తమ తమ అస్తిత్వాల సక్రమ స్వేచ్ఛా న్యాయాన్ని అనుసరించి జీవించటమే స్వయం నిర్ధారిత వ్యక్తి స్వయం నిర్ధారిత సమాజాల ఆదర్శ స్థితి. కానిమానవ జాతి ప్రస్తుతం ఉన్న వాస్తవ పరిస్థితిలో, నిజమైన వ్యక్తిని నిజమైన సంఘ ధర్మాన్ని ఉల్లంఘనలకు పెడత్రోవలకు గురి చేసే అజ్ఞాన ప్రమాద స్థితిలో, రాజనో, పరిపాలనా సంస్థనో సంఘ సహజ జీవితం మీద పైనుంచి విధించక తప్పలేదు కాని తనకు సహజ సిద్ధమైన న్యాయాన్ని, ఆచారాన్ని స్వచ్ఛంద వికాసాన్ని బట్టి చాలవరకు వ్యవహరించవలసిన సంఘం జీవితంలో అక్రమంగా జోక్యం చేసుకోవటం కాక, సంఘ క్రమ విధానాన్ని పర్యవేక్షించి సహాయపడుతూ ధర్మం శక్తివంతంగా ఉండేటట్లు, అవలంబించబడేటట్లు చూస్తూ ధర్మం పట్ల జరిగే అపచారాలను శిక్షించి వాటిని అణగద్రొక్కి వీలైనంత వరకు వాటిని నివారించటం అది చేయవలసిన పని. ధర్మ భ్రష్టత మరీ హెచ్చి పోయినప్పుడు ఒక శాసన కర్త, బాహ్య లిఖిత న్యాయ నియమ నిబంధనలతో సర్వ జీవితాన్నీ శాసించె ఒక ప్రభుత్వ స్వరూపం అవతరించవలసిన ఆగత్యం కలుగుతుంది. బాహ్య పరిపాలనా వివరాలు విడిచిపెట్టితే ధర్మాన్ని

నిర్ణయించవలసింది సంఘ-మత సృష్టి కర్త ఋషి లేదా గ్రంథకారుడు వ్యాఖ్యాత అయిన బ్రాహ్మణుడు గాని, దాన్ని నిర్వహించవలసిన అర్హత మాత్రం ఉన్న రాజకీయ ప్రభువు కాదు. న్యాయం లిఖిత రూపంలో ఉన్నా లేకపోయినా, అది రాజకీయాధికారమో శాసనాధికారమో సృష్టించేదో కల్పించేదో ఎన్నడూ కాదు. అది అదివరకు ఉన్నదే. ఉన్నదానిని ఉన్నట్లు గానో లేదా సామాజిక జీవితంలో చైతన్యంలో అదివరకే ఉన్న న్యాయాన్నుంచి సూత్రం నుంచి వృద్ధి పొందినదిగానో దానిని వ్యాఖ్యానించటం ప్రకటించటం వరకే చేయగలిగింది. పెరుగుతున్న ఈ కృత్రిమత్వంలో సాంప్రదాయంలో వృద్ధిపొంది అత్యంత దుష్టంగా పరిణమించిన చిట్టచివరి సంఘ దశకు అరాజకం, సంఘర్షణ, ధర్మనాశనం, లక్షణాలుకాక తప్పదు. కలియుగం ఇదే. పునరుజ్జీవనానికి, మానవ చైతన్యం నూతనంగా స్వయం ప్రకటన కావటానికి పూర్వం ఈ ప్రళయ సంఘర్షణల సాయం సంధ్యారుణ చ్ఛాయల కాలం రాక తప్పదు.

ఇందుచేత సంఘ జీవితానికి చెందిన పటిష్ఠ న్యాయాన్ని సేవించి నిర్వహించి దానికి చేయూత ఇవ్వటమే రాజకీయ ప్రభుత్వం, అయన సలహా మండలి, రాజకీయ వ్యవస్థలోని ఇతర పాలక సభ్యులు నిర్వర్తించవలసిన ప్రధాన విధి. రాజు ధర్మనిర్వాహకుడు, సంరక్షకుడు. మానవుని ప్రాణిక, ఆర్థిక, తదితర ఆవశ్యకతలు సక్రమ పద్ధతిలో సంతృప్తి కావటం, సుఖాన్ని, ఆనందాన్ని అనుభవించటానికి అతనికి ఉన్న అధికారం, సంఘ నిర్వహణ విధిలో ఇమిడి ఉన్నాయి. కాని వాటి ఉన్నత న్యాయం సక్రమ పరిమాణాలను బట్టి, నైతిక, సాంఘిక మత ధర్మాన్ని బట్టి దానికి

లోబడి ఆ విధంగా జరగాలి: తమ తమ హద్దులలో సహజ స్వయం నిర్దిష్ట మార్గంలో వర్తించటానికి వాటిని వదలిపెట్టాలి. కాని అదే సమయంలో అతిక్రమణ అక్రమ ఆక్రమణ జరగకుండా, సక్రమ సాధన నుంచి వాస్తవ పరిమితుల నుంచి తొలగిపోకుండా వాటిని అదుపులో ఉంచాలి. ప్రజా సభల తోడ్పాటుతో. సలహా మండలితో కూడిన రాజు, అత్యుచ్చ రాజకీయాధికారి, నిర్వహించవలసిన కర్తవ్యం ఇదే జాతి, ప్రతిసమాజం పారిశ్రామిక సంఘం, గ్రామం, పట్టణం, ఒక ప్రాంతానికి లేక రాష్ట్రానికి చెందిన సజీవ ఆచారాలు-వీటిలో జోక్యం చేసుకోవటం గాని, అక్రమంగా వీటిని ఆక్రమించటం గాని రాజ్య వ్యవస్థ అధికారం చేయవలసిన పని కాదు; కారణం, ప్రతిష్ఠ సంఘ ధర్మాన్ని సాధించటానికి ఇది ఆవశ్యకం కాబట్టి స్వభావ సిద్ధంగానే అవి ఉన్నాయి. అది చేయవలసిందల్లా సమన్వయాన్ని సాధించటం, ఒక సాధారణ సర్వోత్కృష్ట నియంత్రణ కలిగి ఉండటం, సమాజ జీవితాన్ని బాహ్య దురాక్రమణాల నుంచి, అంతర్గత విఘాతాల నుంచి రక్షించటం, నేరాన్ని, కల్లోలాన్ని అణచివేయటం, ఆర్థిక పారిశ్రామిక సంక్షేమాన్ని దాన్ని విస్తృత విధానాలలో, బలపరచి, ప్రోత్సహించి, నియమించటం, సౌకర్యాల నేర్పరచటం, ఈ ప్రయోజనాలు నెరవేరటానికి ఇతరుల పరిధిలో లేని అధికారాలను ఉపయోగించటం.

ఈ విధంగా భారత రాజకీయ వ్యవస్థ, సిజానికి, జాతిస్వేచ్ఛ, స్వయం నిర్ణయాలతో కూడిన చాలా సంక్లిష్టమైన నిర్మాణం. జాతిలోని ప్రతి సముదాయం. తన సహజస్థితి తనకే కలదిగా, తనకు అర్హమైన జీవితాన్ని, వ్యవహారాన్ని తానే నిర్వహించుకొనే ప్రత్యేకాంశంగా ఉండేది; తన కార్యరంగానికి పరిమితులకు, సహజమైన సరిహద్దు ఏర్పడి ఉండటం

వల్ల తక్కినవాటితో అది వేరుపడినా చక్కగా అవగాహన అయిన సంబంధాల ద్వారా అది మొత్తంలో కలిసి ఉండేది;ప్రతీదీ. జాతిస్థితిలోని విధి అధికారాలలో, మిగిలినవాటితో సహభాగస్వామిగా వర్తిస్తూ, తన న్యాయాలను నియమాలను అమలుచేస్తూ, తనకు అర్హమైన పరిమితులలో నిర్వహణను సాగిస్తూ, పరస్పర సామాన్య ఆసక్తికర విషయచర్చలలో, నియమాలలో మిగిలినవారితో కూడి ఉంటూ రాజ్యానికి లేక సామ్రాజ్యానికి చెందిన ప్రజాసభలలో తన ప్రాముఖ్యతకు తగిన ఏదో ఒక విధమైన ప్రాతినిధ్యాన్ని వహిస్తూ ఉండేవి. రాజ్యవ్యవస్థ-ప్రభువుగానీ, సర్వోచ్చ రాజకీయాధికారిగానీ- సమన్వయాన్నీ సాధారణనియంత్రిణనీ సామర్థ్యాన్నీ, సాధించే ఉపకరణంగా సర్వోత్కృష్ట అధికారాన్నే తప్ప, నిరంకుశాధికారాన్ని కలిగి ఉండేది కాదు. ఎందుకంటే, దాని హక్కులను, అధికారాలను న్యాయం ప్రజాభీష్టం పరిమితం చేసేవి. అంతరంగ విధు లన్నింటిలో అవి సాంఘిక రాజకీయ సంస్థలో మిగిలిన సభ్యులందరితోబాటు సహ భాగ స్వామిగా మాత్రమే ఉండేవి.

ఇదే భారత రాజకీయ వ్యవస్థ సిద్ధాంతం, సూత్రం, యథార్థ సంవిధానం - సమాజస్వేచ్ఛ, స్వయంనిర్ణయాలు సమన్వయాన్ని నిర్వహించే సర్వోచ్చ అధికారంతో, సార్వభౌమత్వం కల వ్యక్తి లేక సంస్థతో కలిసి ఉన్న సంశ్లిష్టస్థితి, ఈ రాజ్యాధికారానికి సమర్థమైన అధికారాలు ఉన్నత స్థితి, గౌరవం ఉండేవికాని తన స్వకీయమైన హక్కులకు విధులకు పరిమితమై తక్కినవారందరినీ నియంత్రించి వారినియంత్రణకు తానూ లోనౌతూ వారిని అన్ని శాఖలలోను తన సహభాగస్వాములుగా అనుమతిస్తూ సామా

జిక స్థితినిర్వహణలో నియంత్రణలో వారితో పాలుపంచుకొంటూ ఉండేది. ప్రభువు, ప్రజలు. దానిలో భాగాలైన సమాజ సంస్థలు అన్నీ ఒకే రీతిగా ధర్మ నిర్వహణకు కట్టుబడి ధర్మ నిర్ధారదానికి లోబడి ఉండేవి. అదిగాక సామాజిక జీవితంలోని ఆర్థిక రాజకీయాంశాలు ధర్మంలో ఒక భాగం మాత్రమే : ఈ భాగం సాంఘిక జీవితానికి చెందిన మిగతా మత, నైతిక, ఉన్నత సాంస్కృతిక లక్ష్యాలతో విడదీయరాని అనుబంధాన్ని కలిగి ఉండేది గాని విడిగా ఉండేదే కాదు. నైతిక న్యాయం, రాజకీయ ఆర్థిక లక్ష్యాలను ప్రభావితం చేయటమే గాదు రాజు అతని మంత్రులు, సలహా మండలి, ప్రజాసభలు వ్యక్తి, సంఘ సంవిధాన సమూహాలు చేసే ప్రతి పని మీద దాన్ని విధించటం జరిగేది. ఓటు హక్కును వినియోగించుకోవటంలో, మంత్రి అధికారి, సలహాదారుని అర్హతలలో, నైతిక సాంస్కృతిక పరిగణనలకు విలువ ఉండేది. ఆర్య ప్రజల వ్యవహారాలలో అధికారాన్ని వహించిన వారందరికి ఉన్నత శీలము శిక్షణ ఉండవలసి వచ్చేది. రాజు, ప్రజల సమస్త జీవితానికీ మత చైతన్యం మతాన్ని జ్ఞాపకంచేసే విషయాలు మకుటంగా, పూర్వరంగంగా ఉండేవి. సంఘవ్యవస్థలోని భాగాలలో ప్రత్యేకీకరణ ఉన్నప్పటికీ సంఘజీవితం తనకు తానే లక్ష్యంగా ఉంగక దాని అన్ని భాగాలలోనూ మొత్తంలోను కూడ సహజ స్థితినుంచి ఆధ్యాత్మిక చైతన్యస్థితికి జరిగే పరిణామానికి, మానవ మనస్సుకు ఆత్మకు జ్ఞానాన్ని గరపటానికి ఒక మహారచన నిర్మాణంగా, శిక్షణారంగంగా వ్యవహరించేది.



# 3

భారతీయనాగరికత సాంఘిక రాజకీయవికాసం నాలుగుదశలలో జరిగి నట్లు లభించిన లిఖితాధారాల వల్ల తెలుస్తున్నది. మొదటిది సరళ ఆర్య సమాజం; తరువాత రాజకీయ నిర్మాణ సమన్వయాలలో గణనీయ ప్రయోగాత్మక రూపకల్పనలద్వారా జాతిజీవనం పరిక్రమించే దీర్ఘకాల పరివర్తన దశ; మూడవది. ప్రజల సామాజిక జీవనానికి చెందిన సంశ్లిష్ట అంశాలన్నింటినీ ప్రాంతీయ సామ్రాజ్య సమైక్య రూపాలుగా సంయోగం చేయగలిగిన రాజకీయ వ్యవస్థ స్పష్టరూపాన్ని పొందటం; చివరిది, అంతర్గత బంధన, స్తబ్ధతలు కారణంగా పశ్చిమ ఆసియా యూరప్‌ల నుంచి వచ్చిన కొత్త సంస్కృతులకు వ్యవస్థలకు లొంగిపోవలసిన క్షీణయుగం. రూపకల్పనలన్నింటిలోను గమనార్హసంఘటితత్వ స్థిరత్వాలుండటం మొదటి మూడు యుగాల విశిష్ట లక్షణం. ఈ వ్యవస్థకు ప్రధానమైన సాంప్రదాయ రక్షిక స్థిరత్వం ఉండటంవల్ల, సజీవం శక్తిమంతం అయిన ప్రజాజీవన వికాసం ఆలస్యంగా నిదానంగా జరిగింది కాని దీనివల్లనే దాని నిర్మాణ జీవితాలకు అనిశ్చితత్వం దాని ఆకృతికి సంపూర్ణత చేకూరినాయి. క్షీణదశలోకూడ ఈ సంఘటితత్వం, విధ్వంస ప్రక్రియకు ఎదురునిల్చి దానికి వ్యతిరేకంగా నిలబడేది. విదేశాల వత్తిడి కారణంగా పైభాగం విచ్ఛిన్నమయ్యేది కాని తన పునాదిని పరాక్రమణకు ఎదురొడ్డి నిలబడగలిగిన చోట్ల తన విలక్షణ వ్యవస్థను సంరక్షించుకోవటమేగాక, అవసానదశలోకూడ, తన రూపాన్ని చైతన్యాన్ని పునరుజ్జీవింప చేసే ప్రయత్నాలు చేయగలిగేది. ఈనాడు కూడ రాజకీయ వ్యవస్థ సాంతం రూపుమాసిపోయి దాని కడపటి జీవిత రేఖలు అస్తమించిపోయినా, ఈ నాటి స్తబ్ధత, బలహీనత బుద్ధివైపరీత్యాలు విచ్ఛిన్నతలలో, దానిని సృష్టించిన విచిత్ర సాంఘిక మనఃస్థితి స్వభావాలు

నిలిచి ఉన్నాయి. తక్షణ ప్రవృత్తులు, ఆకృతులు ఏవిధంగా ఉన్నా, తన ఇచ్ఛను పద్ధతిని అనుసరించి వర్తించేస్వేచ్ఛ తిరిగి లభించిననాడు ఆది పాశ్చాత్య పరిణామ విధానంలోగాక. తన చైతన్యంలో జనించిన ఒక నూతన సృష్టి వైపు పురోగమించవచ్చు. ఈ కారణంగా జాతి అభ్యుదయ ఆలోచనాపథంలో ఇప్పుడిప్పుడే అస్పష్టంగా కనిపించటం మొదలైన కొరికతో ఈ నూత్నసృష్టి, మానవ సమాజానికి మూలాధారమైన ఆధ్యాత్మిక సాంఘిక జీవితతృతీయ దశారంభం వైపుకు దారితీయవచ్చు. ఏదిఏమైనా దాని నిర్మాణాల దీర్ఘకాల స్థిరత్వం వాటి ఆశ్రయంలోని జీవిత మహత్త్వం, అసమర్థతకు చిహ్నాలుకాకపోగా భారతదేశ సాంస్కృతిక మనః స్థితిలోని సమర్థతకు అసాధారణ రాజకీయ అంతర్బుద్ధికి అవి సూచనలు.

భారతరాజకీయ వ్యవస్థా నిర్మాణంలో, విస్తృతిలో, పునర్నిర్మాణంలో ఆసాంతం ఆధార భూమిక వద్ద శాశ్వతమై పోయిన సూత్రం, సజీవమైన స్వయం నిర్ణయ సామాజిక జీవిత సూత్రం. ఈ స్వయం నిర్ణయం చేసింది, కేవలం జనసమూహంలో వోటు యంత్రాంగాల ద్వారా పై అంచున నిలడిన, జాతి ఒక భాగానికే చెందే రాజకీయ మనః స్థితికి ప్రాతినిధ్యం వహించిన, ప్రతినిధి సంస్థ కాదు. ఆధునిక వ్యవస్థకు చేతనైనది ఈ మాత్రమే కాగా భారతీయ స్వయం నిర్ణయసూత్రం ప్రతి జీవిత స్పందనలోను, అస్తిత్వంలోని ప్రతి ప్రత్యేక భాగంలోను ప్రవర్తించింది. స్వేచ్ఛా సమన్వయాలు కల సామాజిక వ్యవస్థ దాని లక్షణం. అది ఉద్దేశించిన స్వాతంత్ర్యానికి సామాజిక స్వేచ్ఛ కావలసినంతగా వ్యక్తిగత స్వేచ్ఛ అక్కరలేదు. ప్రారంభంలో గ్రామం, వంశం లేక తెగ లేక స్వల్ప ప్రాంతీయ ప్రజాసముదాయం అనే రెండే సామాజిక విభాగాలను పరిగణించవలసినందువల్ల ఈ సమన్వయ సరళంగా ఉండేది. స్వయంపాలిత

గ్రామీణ సమాజం ఆధారంగా మొదటి దాని సువ్యవస్థిత స్వేచ్ఛా జీవనం నిలిచి ఉండేది. ఇంతకాలం గడిచినా చెక్కుచెదరకుండ, పరవ్యవస్థల తాకిళ్ళకు తట్టుకొని దాదాపుగా ఈనాటి వరకు మనగలిగేట్లు తగినంత పుష్కలంగా, దృఢంగా ఈ పని జరిగింది. చాలా ఇటీవలనే క్రూరము జడము అయిన బ్రిటిషు ఉద్యోగివర్గ పాలనా వ్యవస్థ యంత్రాంగం క్రింద అణగారి అస్తిత్వాన్ని కోల్పోయింది. చాలా వరకు వ్యవసాయమే ఆధారంగా గ్రామాలలో నివసిస్తున్న ప్రజలంతా, స్పష్టమైన విధుల విభజనగాని శ్రామికవర్గ విభజనగాని లేకపోయినా, రాజు నాయకత్వంలో, ఒకే మొత్తంగా, తమ్ము తామే సమితి అనబడే ప్రజాసభ ద్వారా పాలించుకొనే ఒకేఒక మత సాంఘిక నైతిక రాజకీయ సంస్థగా రూపొందటం జరిగింది.

అత్యంత సరళ వ్యవసాయిక గ్రామీణ జీవితానికి, ఒక పరిమిత ప్రదేశంలో నివసిస్తున్న స్వల్పసంఖ్యాకులకే తప్ప ఈ వ్యవస్థ అనువైనది కానందువల్ల ఇంకా ఎక్కువగా సంక్లిష్టమైన సామాజిక వ్యవస్థ ఏర్పడటం ప్రధాన భారతీయ సూత్రానికి మార్పుచేసి మరింత క్లిష్టంగా అన్వయించటం తప్పనిసరి అయింది. ఆర్యజాతికి ప్రారంభంలో సర్వసామాన్యమైన వ్యవసాయిక గ్రామీణ జీవితం (కృష్టయః) దానికి ఎప్పుడూ ఘనమైన ఆధారంగా ఉండేదికాని వాణిజ్యపరిశ్రమలు లెక్కలేనన్ని హస్తకళలతో ఒక సుందర ఉపరిసౌధాన్ని, ప్రత్యేకీకరించిన నైతిక రాజకీయ, మత విద్యా వృత్తులు విధులతో వేరొక చిన్న కట్టడాన్ని అది రూపొందించింది. మొదటి నుంచి చివరిదాకా గ్రామీణ సమాజం స్థిరసంస్థగా, దృఢబీజంగా, అవిచ్ఛేద్య అణువుగా ఉండిపోయింది కాని పదులు వందల సంఖ్యలో సామూహిక గ్రామ జీవితం వృద్ధిపొంది ప్రతిదానికి ఒక నాయకుడు పరిపాలనావ్యవస్థ కావలసిన అగత్యం ఏర్పడింది. విజయ యాత్రలు లేక ఇతరులతో కలయిక వల్ల వశం పెద్దదైనప్పుడు, ఇవి, ఒక రాజ్యాంగంలోగానిలేక

గణతంత్ర రాజ్యకూటమిలోగాని సంపిధాన భాగాలై పోయేవి. ఇవి మళ్ళీ ఇంకా పెద్ద రాజ్యాలలో మండలాలై, చివరకు ఒకటో అంతకన్న ఎక్కువో మహా సామ్రాజ్యాల రూపం పొందేవి. నూతన పరిస్థితుల వ్యవస్థకు, ఈ పరిణామ వృద్ధికి తగినట్లు స్వయం నిర్ధారిత సామాజిక స్వేచ్ఛతో కూడిన క్రమబద్ధత అనే సూత్రాన్ని జయప్రదంగా అనువర్తించటమే, సాంఘిక రాజకీయ నిర్మాణంలో భారతీయులు కన్పరచిన అసాధారణ ప్రజ్ఞకు గీటురాయి.

ఈ అవసరాన్ని తీర్చటానికి భారతీయ మనఃస్థితి నాలుగు వర్ణాలతో కూడిన నిలకడ గల సాంఘిక మత వ్యవస్థను నిర్మించింది. ఎప్పుడో ఒకప్పుడు సహజక్రమంలో అనేక మానవజాతులలో రూపొందిన పురోహిత వర్గం, సైనిక రాజకీయ ఉన్నత వంశపాలక వర్గం, చేతి పని వారి స్వేచ్ఛా వ్యాపసాయదారుల వర్గం, కూలీలు కార్మికుల శ్రామిక వర్గం అనే సుపరిచిత సాంఘిక వ్యవస్థకు మరింత కఠినమైన రూపంగా ఇది బయటకు కనిపించ వచ్చు. అయితే ఈ పోలిక కేవలం బాహ్యలక్షణాలలో మాత్రమే చాతుర్వర్ణ వ్యవస్థ యొక్క లగుణం భారతదేశంలో భిన్నంగా ఉండేది. తరువాతి వేదకాలంలో పురాణకాలంలో చాతుర్వర్ణవ్యవస్థ విడదీయరాని ఒకే ఒక మత, సాంఘిక, రాజకీయ ఆర్థిక నిర్మాణరచనగా ఉండి ఆ నిర్మాణంలో ప్రతివర్ణానికి దాని సహజ సిద్ధమైన భాగం ఉండటమేగాక వాటిలో ఏదొకటి ప్రధాన కార్యకలాపాలు దేనిలోనూ తన భాగంలోగాని స్థితిలోగాని మిగిలిన వాటితో విడిబడి ఉండేదికాదు. ప్రాచీన వ్యవస్థను అర్థం చేసుకోవటానికి ఈ లక్షణం చాలా ముఖ్యమైనది. కాని ఊహాపోహల వల్ల కలిగిన అసత్యా భావనలు, చాల వరకు క్షీణదశకు మాత్రమే సంబంధించిన పరిస్థితులు ఆ తరువాతి పరిణామాలను గురించిన అతిశయోక్తుల వల్ల ఈ లక్షణం మరుగునపడిపోయింది. ఉదాహరణకు పవిత్ర వేద విజ్ఞానంలో లేదా

అత్యున్నత ఆధ్యాత్మిక జ్ఞానంలో అవకాశాలలో బ్రాహ్మణులకే ఏకాధిపత్యం ఉండేదేకాదు. ఆధ్యాత్మిక నాయకత్వం కోసం బ్రాహ్మణులు క్షత్రియుల మధ్య ఒక విధమైన స్పర్ధ మొదట్లో మనకు కనిపిస్తుంది. విద్వాంస పురోహిత వ్యవస్థ భేషజాలకు వ్యతిరేకంగా చాలకాలం క్షత్రియులు తమ ప్రత్యేకతను నిలబెట్టుకొన్నారు. న్యాయశాస్త్ర నిపుణులుగా, ఆచార్యులుగా, పురోహితులుగా, తమ కాలాన్ని శక్తిని తత్త్వశాస్త్రానికి, పాండిత్యానికి పవిత్రగ్రంధాధ్యయనానికీ దారి పోసిన బ్రాహ్మణులు చివరకు ఆధిక్యత సాధించి, స్థిరమైన శక్తివంతమైన ఆధిపత్యాన్ని పొందగలిగారు. పురోహిత పండిత వర్గం మత ప్రామాణికులుగా, పవిత్రగ్రంధాలకు సాంప్రదాయాలకు రక్షకులుగా, న్యాయానికి శాస్త్రానికి వివరణ కర్తలుగా, విజ్ఞాన శాఖ లన్నింటిలో గుర్తించబడిన ఆచార్యులుగా, ఇతర వర్ణాలవారికి సాధారణ మత బోధకులుగా, గురువులుగా ఉంటూ, అందరినీ కాకపోయినా, పెద్ద సంఖ్యలో, తత్త్వవేత్తలను, మేధావులను, విద్యావంతులను పండితులను అందించేవారు. వేద ఉపనిషదధ్యయనాధికారం మూడు ఉన్నత వర్గాలవారికీ కూడ ఉన్నప్పటికీ ప్రధానంగా అది వారి చేతుల్లోకే పోయింది. శూద్రులకు ఆ అధికారం సిద్ధాంతరీత్యా మాత్రమే నిరాకరించటం జరిగింది. అయితే వాస్తవంలో మాత్రం, తరువాతి కాలంలోకూడా, ప్రాచీన స్వేచ్ఛలోని సారభూతమైన అంశాన్ని నిలబెట్టిఉంచిన మతోద్యమ పరంపర ఆధ్యాత్మిక విజ్ఞానాన్నీ అవకాశాన్నీ అందరి ముంగిటికీ తెచ్చింది. ఆరంభదశలో లాగానే అన్ని వర్గాలలోను వేద వేదాంత ఋషులు జన్మించారు; చిట్ట చివరిదాకా యోగులు, ఋషులు ఆధ్యాత్మ వేత్తలు, నూత్న విధానస్రష్టలు, ప్రతిష్ఠాపకులు, మతానికి చెందిన కవులు గాయకులు, సాంప్రదాయిక

ప్రమాదాలకు పాండిత్యానికి భిన్నమైన సజీవ ఆధ్యాత్మిక చైతన్య విజ్ఞాన మూలాధారాలుగా, అట్టడుగున గల శూద్రులు, అసహ్యించుకొని అణగ ద్రొక్కిన ఛండాలులతో సహా సమాజంలోని అన్ని స్థాయిలలోనూ కనిపిస్తారు.

ఒక స్థిరమైన భిన్న సాంఘిక స్థాయిలతో కూడిన వ్యవస్థగా నాలుగు వర్ణాలూ పరిణమించాయి ఛండాలుర హోదాను తప్పిస్తే ప్రతి వర్గానికీ ఒక ఆధ్యాత్మిక జీవితం, ప్రయోజనం, ఒక నిశ్చిత సాంఘిక గౌరవం, ఒక విద్యా పద్ధతి, సాంఘిక నైతిక ప్రతిష్ఠకు చెందిన ఒక సూత్రం, సామాజిక సంస్థలో ఒక స్థానం, ఒక విధి, ఒక హక్కు ఆపాదించటం జరిగేది. ఒక స్థిరమైన శ్రమవిభజనకు నిలకడ అయిన ఆర్థిక స్తోమతను అప్రయత్నంగా సమకూర్చే సాధనంగా ఈ వ్యవస్థ ఉపక రించేది: మొదట్లో వంశపారంపర్య సూత్రం వర్తించేదిగాని ఇక్కడ గూడ ఆచరణ కంటే సిద్ధాంతమే కఠినంగా ఉండేది స్వీయ వ్యవస్థలో తన పలుకుబడి, అంతస్తును బట్టి సంఘంలో, పరిపాలనలో, రాజకీయాలలో ప్రాముఖ్యతను పొందకుండా, సంపద కూడ బెట్టటానికి హక్కును అవకా శాన్ని లేకుండా ఎవ్వరినీ అడ్డగించటం జరగలేదు. కారణం, చివరగా, సాంఘిక శ్రేణీవ్యవస్థ (Social hierarchy) అదే సమయంలో రాజ కీయ శ్రేణీ వ్యవస్థగా ఉండలేదు. సామాన్య రాజకీయ పౌరహక్కులలో, ప్రజా ప్రతినిధి సభలలో పరిపాలనా సంస్థలలో నాలుగు వర్ణాలకు వాటి స్థానం తమ వంతు పలుకుబడి వాటికి ఉండేవి. కనీసం చట్టరీత్యా, సిద్ధాంతరీత్యా, అన్యప్రాచీన జాతుల అభిప్రాయానికి విరుద్ధంగా, స్త్రీలకు పౌరహక్కులను నిరాకరించటం జరగలేదని గమనించాలి. అయితే, ఆచరణలో, ఏ కొద్దిమందినో తప్పిస్తే, పురుషులకు వారు విధేయులు కావటం గృహకృత్యాలలో నిమగ్నులై ఉండటం చేత ఈ సమానత్వం నిరుపయోగమై పోయింది; రాజులుగా పాలకులుగా మాత్రమేగాక యుద్ధ

రంగంలో కూడా స్త్రీలకు పాత్ర ఉండటం భారతచరిత్రలో సర్వసామాన్య విషయం; కాని వారు పౌర సంస్థలలో ఎన్నికైన ప్రతినిధులుగా వ్యవహరించిన నిదర్శనాలు కూడ చరిత్ర పుటలలో ఇంకా నిలిచిఉన్నాయి.

సామాన్య జీవితంలో అన్ని వర్ణాలవారు సన్నిహిత భాగస్వాములుగా వ్యవహరించటమే సమస్త భారత వ్యవస్థకు మూలాధారం. ప్రతివర్గానికి తన కార్య క్షేత్రంలో ప్రాధాన్యత ఉండేది. మతంలో, విజ్ఞానంలో విద్యలో బ్రాహ్మణులు; యుద్ధంలో, రాజనీతిలో, అంతర్ రాజ్య రాజకీయ చర్యలో క్షత్రియులు; సంపదను అర్జించటంలో, ఉత్పాదక ఆర్థిక వ్యవహారంలో వైశ్యులు ప్రాధాన్యత వహించారు. ఎవ్వరికీ, శూద్రునికి కూడా, పౌర జీవితంలో భాగాన్ని, రాజకీయాలలో పాలనలో న్యాయ నిర్వహణలో సార్థకమైన స్థానాన్ని, వాణిని లేకుండాచేయలేదు. ఇతర దేశాల రాజకీయ చరిత్రలో ప్రస్ఫుటంగా ప్రముఖంగా ఎంతో కాలం కనిపించిన ఏక వర్గ పరిపాలన రూపాలు భారతదేశ ప్రాచీన రాజకీయ వ్యవస్థలో తలఎత్తలేదు; ఒకవేళ తల ఎత్తినా ఎంతోకాలం నిలబడలేదు. టిబెట్‌లో లాగా పురోహిత వర్గాల మత స్వామ్యవ్యవస్థగాని, ఫ్రాన్స్, ఇంగ్లండ్, ఇతర యూరోపియన్ దేశాలలో లాగా భూస్వామ్య సైనిక ఉన్నత వంశీయ పరిపాలనా వ్యవస్థగాని, కార్థేజ్ వెనీజులలోలాగా కొద్ది మంది వ్యాపారుల పాలనా వ్యవస్థగాని భారతీయ చైతన్యానికి బొత్తిగా సరిపడని రూపాలు. వంశాలు తెగలు, జాతులుగా రాజ్యాలుగా రూపొందే సమయాలలో అవి ఆధిపత్యం కోసం పెత్తనం కోసం ఇంకా పరస్పరం పెనుగులాడుతున్నప్పుడు మహాయుద్ధాలు, సంఘర్షణ శీఘ్ర విస్తరణ సంభవించిన తరుణంలో గొప్పక్షత్రియ వంశాలకు కొంతవరకు రాజకీయ

ప్రాధాన్యత లభించినట్లు మహాభారతంలో ఇప్పటికీ నిలచి ఉన్న, మధ్య యుగంనాటి రాజపుటానాలో మరింత అనాగరిక రూపంలో వంశ రాజ్య వ్యవస్థ (Clan nation) పునరాగమనరూపంలో తల ఎత్తిన సాంప్రదాయాలు సూచిస్తున్నాయి. అయితే ప్రాచీన భారతదేశంలో ఈ దశ కేవలం తాత్కాలికం. దీనివల్ల ఇతరవర్గాలవారి రాజకీయ పౌర ప్రభావం అంతరించలేదు; వివిధ సామాజిక స్వేచ్ఛా జీవితం మీద అణగద్రొక్కే నియంత్రణను విధించటంగాని దానిలో జోక్యం చేసుకోవటంగాని జరగలేదు. మధ్యంతర యుగం నాటి ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యాలు సమస్త ప్రజలూ చురుకుగా ప్రజాసభలలో పాల్గొనాలనే ప్రాచీన సూత్రాన్ని పూర్తిగా భద్రపరచటానికి కృషి చేసిన రాజకీయ సంస్థలేగాని గ్రీకు ప్రజాస్వామ్యాల వంటివికావు. అల్పసంఖ్యాకుల పరిపాలనతో కూడిన గణతంత్ర వ్యవస్థలు వంశ ప్రభుత్వాలు (Clan goverments) గా ఉండేవి: లేదా సంఘంలో పలుకుబడిగల వారితో ఏర్పాటు చేసిన పరిమిత రాష్ట్ర సభలు (Senate) పాలించే ప్రభుత్వాలుగా ఉండేవి. తరువాత కాలంలో, ఇదే రాజసలహామండలి పట్టణ సంస్థలలో లాగానే నాలుగు వర్ణాలకు ప్రాతినిధ్యం వహించే సలహా మండలులుగా ప్రజా సభలుగా పరిణమించాయి. ఏదిఏమైనా ఏ వర్ణానికీ అనుచిత ప్రాధాన్యత లేని ఒక మిశ్రమ రాజకీయ వ్యవస్థ, చివరకు, ఏర్పడింది. ఈ కారణంగానే, గ్రీకు రోమన్ బాధామయ చరిత్రలో సర్వ సామాన్యంగా కనిపించిన పాలితపాలక వర్గాల మధ్య ఘర్షణగాని, నిరంకుశ రాజరిక పాలన స్థిరపడటంతో అంతమైన అల్ప సంఖ్యాక వర్గ పాలనా వ్యవస్థకు (oligarchic) ప్రజాస్వామ్యానికి చెందిన భావ సంఘర్షణ గాని భారతదేశంలో కనిపించవు, అలాగే తరువాతి కాలంలోని

యూరప్‌లో మనకు గోచరించే వర్గ పోరాటానికి ఫలితంగా వచ్చిన క్రమానుగత రూపాల ఆవర్తనం—మొదట ఉన్నత వర్గ పాలకులు, వారిని, అక్రమ ఆక్రమణ ద్వారానో విప్లవంద్వారానో తొలగించివచ్చిన ధనికవృత్తి వర్గాలు, అంటే సామాన్య ప్రజల పేరుతో దోపిడిని సాగిస్తూ పాలించే బూర్జువా పారిశ్రామిక సమాజం, చివరగా ఈనాడు మనందరం అభిమానిస్తున్న అట్టడుగు వర్గాల శ్రామిక పాలన-కూడా కనిపించదు. వైజ్ఞానిక ప్రాణిక పద్ధతులకు అంతగా కట్టుబడక, పాశ్చాత్య ప్రజలకన్న ఎక్కువ అంతర్బుద్ధి మీదనే ఆధారపడ్డ సమన్వయాన్ని సరళత్వాన్ని కలిగిన భారతీయ మనః స్థితి, ఆదర్శ సాంఘిక రాజకీయ వ్యవస్థను ఏర్పరచ లేకపోయిన మాట నిజమే గాని, కనీసం, వివేకవంతము, సుస్థిరము, అయిన-ప్రమాదకర అస్థిరస్థితిలో ఉండే సమతౌల్యాన్నో రాజీమార్గాన్నో, సమతూకాన్నో గాక-సహజశక్తుల, వ్యవస్థల సమన్వయాన్ని, సమాజ శరీరావయవాల స్వేచ్ఛా ప్రవర్తనను గౌరవించే. సజీవము శక్తిమంతము అయిన సమన్వయాన్ని నెలకొల్పింది. ఈ కారణంగా, మానవ వ్యవస్థలన్నింటికి ప్రాప్తించే క్షీణ దశను అరికట్ట లేకపోయినా కనీసం జీవితంలో అలజడిని కల్లోలాన్ని నిస్సందేహంగా నివారించగలిగింది.

రాజకీయ నిర్మాణ శిఖరాగ్రంలో మూడు పరిపాలనాసంస్థ లుండేవి : అవి, మంత్రివర్గ సలహా మండలితో కూడిన రాజు, రాజధాని ప్రజాసభ రాజ్యసాధారణ ప్రజాసభ. సలహామండలి సభ్యులు, మంత్రులు అన్నివర్గాలకూ చెందిన వారుగాఉండేవారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు శూద్రులు స్థిర సంఖ్యలో సలహామండలిలో ప్రతినిధులుగా ఉండేవారు. వైశ్యులకు ఘన ప్రాబల్యం ఉండేది: ప్రజాసమూహాలలో వారికి ఉన్న

సంఖ్యా ప్రాబల్యాన్నిబట్టి ఇది న్యాయమే. తొలినాటి ఆర్యసంఘంలో వైశ్య వర్ణంలో వర్తకులు చిన్నవ్యాపారులే గాక చేతిపనివారు, వృత్తిపని వారు వ్యవసాయ దారులు కూడ చేరి ఉన్నందువల్ల, విశః అనబడే సామాన్య ప్రజానీకంలో వారి సంఖ్య విస్తారంగా ఉండేది. బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర వర్ణాలలో మొదటి రెండు వర్గాలవారికి సంఘంలో ఎంత పలుకుబడి, స్థానం ఉన్నా, తరువాత జరిగిన సాంఘిక పరిణామానికి చెందిన వారు కనుక సంఖ్యాబలంలో వారి స్థితి తక్కువగానే ఉండేది. సాంస్కృతిక క్షీణదశలో, బౌద్ధ కల్లోలం, బ్రాహ్మణ సంఘ పునర్నిర్మాణం తర్వాత ఏర్పడ్డ గందరగోళ పరిస్థితిలో, కృషీవలురు, చేతిపనివారు, చిన్నవ్యాపారులు భారతదేశంలో అనేక భాగాలలో శూద్రుల స్థాయికి దిగజారి పోయారు. వీరిపైగా చిన్నబ్రాహ్మణ సంఘం, మధ్యలో చెదురు మదురుగా క్షత్రియులు, వైశ్యులు ఉండేవారు. సమాజానికి అంతటికీ ప్రాతినిధ్యం ఆ విధంగా వహించిన సలహామండలి అత్యున్నత కార్యనిర్వాహక వర్గంగా, పరిపాలనా సంస్థగా ఉండేది. రాజ్య, విత్త విధానాలకు చెందిన ముఖ్య విషయాలు అన్నింటిలోను, సమాజ ప్రయోజనాలకు అన్నిటికీ సంబంధించిన రాజాజ్ఞలకు, దాని ఆమోదము భాగస్వామ్యము అత్యావశ్యకం అయ్యేది. పరిపాలనా శాఖల వ్యవస్థ సహాయంతో రాజ్య కార్యకలాపాల వివిధ శాఖ లన్నింటిని, రాజు, మంత్రులు, సలహా మండలి పర్యవేక్షించి నియంత్రించే వారు. కాలంతోపాటు రాజు అధికారం నిస్సందేశంగా పెరుగుతూనే వచ్చేది: తన ఇచ్ఛానుగుణంగా, చొరవతో ప్రవర్తించాలని అతడు తరచు ప్రలోభ పడేవాడు కాని వ్యవస్థ శక్తివంతంగా ఉన్నంతవరకు, తన మంత్రుల అభిప్రాయాలనుగాని, సలహామండలి అభిప్రాయాలను గాని ధిక్కరించటం

అతనికి ప్రమాదకరం అయ్యేది. అత్యంత శక్తివంతుడు, బలమైన ఇచ్ఛా శక్తికల అశోకునివంటి సామ్రాట్టు కూడ తన సలహా మండలితో వచ్చిన సంఘర్షణలో ఓడిపోయి అధికారాన్ని సైతం త్యాగం చేయవలసి వచ్చినట్లు కనిపిస్తున్నది. అవిధేయుడు లేదా అసమర్థుడు అయిన రాజును పదభ్రష్టుణ్ణిచేసి అతని స్థానంలో అతని కుటుంబానికి చెందిన వేరొక వ్యక్తిని గాని లేక మరొక రాజవంశాన్నిగాని సలహా మండలితో కూడిన మంత్రులు నిలబెట్ట గలిగేవారు; నిలబెట్టారుకూడా. ఉదాహరణకు మౌర్యుల నుంచి శుంగులకు మరల వారి నుంచి కణ్వులకు సంభవించిన రాజవంశీయ విప్లవాల వంటి చాలా చారిత్రకమైన మార్పులు ఈ విధంగానే వచ్చాయి. రాజ్యాంగ సిద్ధాంతానికీ సాధారణ ఆచరణకు చెందిన వాస్తవ స్థితిలో, రాజ శాసనం అంటే యదార్థంలో మంత్రులసహాయంతో సలహామండలితోకూడిన రాజశాసనం అన్నమాట. అతడు వ్యక్తిగతంగా తీసుకున్న ఏ చర్య అయినా వారి ఆమోదాన్ని బట్టి, ధర్మం తనకు అప్పగించిన విధులకు న్యాయబద్ధుడై విశ్వాస పాత్రుడై నిర్వహించటాన్ని బట్టి, చెల్లుబాటు అయ్యేది. సలహామండలి అత్యావశ్యక అధికార సంస్థగా లేక కార్య నిర్వహణ కేంద్రంగా నిర్వహించగలిగిన పరిధిలో వర్తిస్తూ, సజీవ సంఘ వ్యవస్థలో ప్రధానాంశాలైన నాలుగు వర్ణాలను తన సంవిధానంలో కేంద్రీకరించి ప్రాతినిధ్యాన్ని వహించేది. ఈ అధికారానికి రాజు ఒక క్రియాశీల అధిపతిగానే తప్ప, నిరంకుశరాజ్యంలో లాగా తానే రాజ్యంగా, దేశానికి సొంతదారుడుగా, అణగిమణిగి ఉన్న పాలితుల జాతికి బాధ్యతారహిత వ్యక్తిగత పరిపాలకుడుగా వ్యవహరించేవాడుకాదు ప్రజలు విధేయత చూపవలసింది న్యాయానికి, ధర్మానికి, ధర్మ సేవకు, నిర్వహణకు పరి

పాలనా సాధనంగా మాత్రమే అయిన సలహా మండలితో కూడిన రాజు శాసనాలకు.

అదే సమయంలో, సార్వభౌముని అతని మంత్రుల నిరంతర తక్షణ ప్రభావానికి లోబడి వర్తించే సలహామండలి లాంటి చిన్న సంస్థ, ఒక్కటీ ఏకైక పరిపాలనా సంస్థ అయి ఉంటే, నిరంకుశ పాలనా సాధనంగా పరిణమించే ఉండేది. కాని తక్షణ రాజ ప్రభావానికి లోబడ కుండా స్వతంత్ర ప్రతి పత్తితో విస్తృత ప్రమాణంలో సజీవ సంఘ వ్యవస్థకు ప్రాతినిధ్యంవహిస్తూ, దాని మనోజీవ, ఇచ్ఛలకు సమీపసన్నిహిత ప్రకటనలుగా వ్యవహరించే శక్తివంతమైన రెండు ఇతర సంస్థలుండేవి. అవి నిరంతరం విస్తృత పరిపాలనా అధికారాలను పరిపాలనా శాసన నిర్మాణాన్ని నిర్వహిస్తూ సర్వదా రాజాధికారం మీద అదుపు ఉంచగల సమర్థత కలిగి ఉండేవి. ఎందుకంటే వాటికి అసంతృప్తి కలిగినప్పుడు జనాదరణను కోల్పోయిన లేదా నిరంకుశుడైన రాజును అవి తొలగించగలిగేవి : కాకపోతే అతడు ప్రజాభీష్టానికి తలవంచే వరకు పరిపాలించటం అసాధ్యం అయ్యేటట్లు చెయగలిగేవి. ఇవి రాజధాని, సాధారణ మహా ప్రజా సభలు, తమ ప్రత్యేకాధికారాలను వినియోగించటానికి దేనికది విడివిడిగానూ, సర్వ ప్రజానీకానికీ సంబంధించిన విషయాలతో సంయుక్తంగానూ, సమావేశం అయ్యేవి.[1] రాజ్య రాజధానిలో లేదా సామ్రాజ్య రాజధానిలో పౌరసభ నిరంతర సమావేశం జరిపేది ;—సామ్రాజ్య వ్యవస్థలో తక్కువ స్థాయికి

---

(1) ఈ సంస్థలను గురించిన వాస్తవాలు ( నా ప్రయోజనం కోసం ప్రముఖమైనవాటిని మాత్రమే నేను ఎన్నుకోవటం జరిగింది) ప్రకాశ వంతము నిష్ఠా పూర్వకంగా సాక్ష్యాధార పత్రాలతో కూడిన శ్రీ జయ స్వాల్ రచననుండి తీసికొనబడినాయి.

చెందిన ఇట్టిసంస్థలు రాష్ట్ర ప్రధాన నగరాలలో కూడా ఉండినట్లు కనిపిస్తుంది. ఆ నగరాలు స్వతంత్ర రాజ్యాలు రాజధానులుగా ఉన్న కాలంలోని ప్రజాసభలకు అవి అవశేషాలు-సమాజంలో అన్ని వర్ణాలకు కనీసం మూడు వర్ణాలకు చెందిన పట్టణ వృత్తి సంఘాలు, కులసంస్థల ప్రతినిధులతో ఈ పౌర సభ నిర్మాణం అయ్యేది. గ్రామీణ నగర ప్రాంతాలు రెండింటి లోను, వృత్తి సంఘాలు, కుల సంస్థలు, తామే, సమాజ స్వయం పాలన సజీవ సంవిధాన సంస్థలుగా వ్యవహరించేవి. పౌర సర్వోచ్ఛ సభ రాజధాని పరిమితులలోగల సజీవ నిర్మాణం అంతటికీ సామూహిక ప్రాతినిధ్యం వహించే జీవ సంస్థగాని కృత్రిమ సంస్థగాదు. ఐదుగురు, పదిమంది, అంతకుమించిన సంఖ్యగల సభ్యులతో కూడిన పరిపాలనా సమితులు సంఘాలద్వారా, తక్కువ స్థాయికి చెందిన విధేయ ప్రజా సభల ద్వారా ప్రత్యక్షంగానో పరోక్షంగానో పట్టణ జీవితాన్నంతా ఈ పౌరసభ పరిపాలించేది. అంతేగాదు. వృత్తి సంఘాలు విధిగా పాటించవలసిన నిబంధనలు శాసనాలద్వారా, ప్రత్యక్ష పరిపాలన ద్వారా, పౌర సమూహానికి చెందిన వ్యాపార, పారిశ్రామిక, విత్త పురపాలక, వ్యవహారాలను నియంత్రించి పర్యవేక్షించేది. దీనికితోడు తన సలహాను తప్పక పొందవలసినంత శక్తి గలిగి ఉండేది. విస్తృత రాజ్యవ్యవహారాలలో కొన్నిసార్లు ప్రత్యేకంగా, మరికొన్ని సార్లు సాధారణ ప్రజాసభ సహకారంతో, చర్య తీసికొనగలిగి ఉండేది. అది ఎప్పుడూ రాజధానిలో ఉండటం, పనిచేయటం మూలంగా

రాజు, అతనిమంత్రులు, వారి సలహామండలి, పరిగణించక తప్పని శక్తిగా రూపొందింది. ఎక్కడైనా రాష్ట్రాలలో దూరంగా ఉన్న పౌర ప్రజాప్రతినిధి సభలుకూడ రాజ మంత్రులతో గాని గవర్నర్లతోగాని ఘర్షణ వచ్చినప్పుడు, తమ స్థానం ప్రత్యేక హక్కుల విషయంలో అవమానానికి లోనైనప్పుడు, రాజ ప్రతినిధుల పట్ల అసంతృప్తి చెందినప్పుడు, తమ అసమ్మతిని స్పష్ట పరచగలిగేవి. తమ్ము అవమానించిన అధికారిని ఉపసంహరించేటట్లు నిర్బంధించగలిగేది,

అదేరీతిగా, రాజధానికి బయట ఉన్న సర్వదేశ ఇచ్ఛా మనః స్థితులకు, సాధారణ ప్రజాసభ సజీవ ప్రాతినిథ్యం వహించేది: ఎందుకంటే దానిలో అధికార ప్రతినిధులు, చిన్న పట్టణాల, గ్రామాల ఎన్నికైన పాలకులు గాని ముఖ్యులుగాని ఉండేవారు. ప్రాతినిధ్యం కల జాతులలోని ధనవంతులనే ప్రధానంగా చేర్చుకోవటం వల్ల దీని నిర్మాణంలో కొంత ధనిక వర పాలనా ధోరణి ప్రవేశించినట్లు కనిపిస్తుంది. అందుచేత ఒక విధంగా ఇది సంపూర్ణ ప్రజాస్వామ్య విధానానికి చెందక, సామాన్య ప్రజాసభ వంటిదే అయినా (చాలా ఇటీవల కాలంనాటి పార్లమెంటులను మినహాయిస్తే తదితర ప్రజాసభల లాగా కాక దీనిలో వైశ్య క్షత్రియులతోపాటు శూద్రులు గూడా ఉండేవారు) ప్రజల జీవ మనః స్థితులకు తగినంత నమ్మకమైన ప్రకటనగానే ఉండేది. అయితే అది సర్వోచ్ఛ ప్రజా ప్రతినిధి సభమాత్రం కాదు; కారణం దానికి ఉన్నదల్లా రాజుకు సలహా మండలికి రాజధాని ప్రజాసభల మాదిరిగానే ఆజ్ఞలు నిబంధనలు జారీచేసే అధికారమేగాని ప్రధానశాసనాలను జారీచేసే అధికారం లేదు. దేశ ప్రజల జీవితానికి చెందిన వివిధ కార్యకలాపాలను సమన్వయపరచటంలో ప్రజాభీష్టానికి ప్రత్యక్ష సాధనంగా వ్యవహరించటం, ఇవి సరియైన దిశలో పోయేటట్లు చూడటం, ప్రజల వాణిజ్య, పారిశ్రామిక, వ్యావసాయిక, సాంఘిక, రాజకీయ జీవితంలో క్రమబద్ధతను, సంక్షేమాన్ని సమకూర్చటం, రాజు ఆయన సలహామండలి నుంచి ప్రత్యేక హక్కులను సౌకర్యాలను సాధించటం, సార్వభౌముని చర్యలను ఆమోదించటం లేక నిలిపివేయటం, అవసరమైనప్పుడు ప్రజా ప్రతినిధులకు లభించేసాధనాల ద్వారా అతనిని ఎదిరించి దుష్పాలనను నిరోధించి అంతమొందించటం దాని పనులు. రాజధాని ప్రజాసభ సాధారణ ప్రజా వభల సంయుక్త సమావేశం వారసత్వ వ్యవహారాలలో సలహా

నిచ్చేది; సార్వభౌముణ్ణి పదభ్రష్టుణ్ణి చేసేది; సింహాసనాన్ని పాలక కుటుంబాన్నుంచి మరొక కుటుంబానికి బదిలీచేయగలిగేది, రాజు మరణానంతరం వారసత్వాన్ని మార్చగలిగేది; న్యాయోల్లంఘనం, దేశద్రోహం వంటి రాజకీయ వాసనగల సందర్భాలలో కొన్నిసార్లు అది సర్వోత్కృష్ట న్యాయస్థానంగా వ్యవహరించేది. రాజ్య విధానానికి చెందిన ఏవిషయాన్ని గురించిన రాజనిర్ణయాలనైనాసరే ఈ ప్రజాసభలలో ప్రకటించి, ప్రత్యేక పన్నులు, యుద్ధం, యజ్ఞం, విస్తృత నీటిపారుదల పథకాలు మొదలైన వాటి లోను దేశానికి ప్రాణప్రదమైన ప్రయోజనాలకు చెందిన అన్ని సందర్భాల లోను, వాటి ఆంగీకారాన్ని పొందవలసివచ్చేది. ప్రతిదినము ఈ రెండు సభలనుంచి చక్రవర్తికి ప్రతిపాదనలు చేరటాన్నిబట్టి ఇవి ప్రతిదినము సమావేశం అయ్యేవని తెలుస్తున్నది. వాటి హక్కులను కార్యకలాపాలను సమగ్రంగా సమీక్షిస్తే, అవి సార్వభౌమత్వంలో భాగస్వాములనీ, సార్వభౌమత్వాధికారాలు వాటి అంతర్భాగాలేననీ, సాధారణంగా తమ పరిధిలోనికి రాకపోయినా, అసాధారణ పరిస్థితులలో ఈ సార్వభౌమాధికారాలను గూడ అవి వినియోగించేవనీ స్పష్టపడుతుంది. సమాజ ధర్మాన్ని మార్చటానికి ప్రయత్నించటంలో అశోకుడు రాజాజ్ఞల ద్వారా కాక, ప్రజాసభలో చర్చల ద్వారా చర్యతీసుకోవటం గమనార్హం. ఈ రెండు సంస్థలు రాజ్యకార్యకలాపాలను నిర్వహించే సంస్థలేగాక అవసరమైనప్పుడు రాజ్యవ్యతిరేక సాధనాలుగా కూడ వర్తించగల లక్షణాలను కలిగి ఉన్నట్లు చెప్పిన ప్రాచీనుల వర్ణన సమర్థనీయంగానే కనిపిస్తుంది.

ఈ మహాసంస్థలు రెండూ అంతరించిపోయింది మహమ్మదీయ దండయాత్రల ముందా లేక విదేశీ విజయాల మూలంగానా అనేది స్పష్టంగా

తెలియదు. ఈ వ్యవస్థ అగ్రభాగంలో భంగపాటు సంభవించినట్లయితే, ఇతర సంబంధాలులేక ఏడిగా వుండిపోవటం వల్లనూ, సమాజ విస్తృత వ్యవహారాల మీద ఏకైకాధిపత్యం ఉండటంవల్లనూ, పరిమిత నిరంకుశంగా వ్యవహరించే అవకాశం ఉన్న ప్రభుత్వానికీ, అవసాన దశలోని గ్రామీణ సమాజాలలాగా, తమ అంతర్గత వ్యవహారాలను తాము నిర్వహించుకుంటూ, ఉన్నత రాజ్య విషయాలతో సజీవసంబంధం లేకుండా పోయిన సాంఘిక రాజకీయ సంస్థలోని ఇతర సంవిధాన భాగాలకీ మధ్య పెద్ద అఖాతం ఏర్పడి, జీవితసమన్వయం అనివార్యం అయిన సంశ్లిష్ట సామాజిక స్వేచ్ఛా వ్యవస్థలో గొప్ప బలహీనతకు దారితీస్తుందనేది సుస్పష్టం. ఏదిఏమైనా వ్యక్తి గత నిరంకుశ పరిపాలనా సాంప్రదాయాలను వెంటబెట్టుకొని వచ్చిన మధ్య ఆసియా దండయాత్రలు, ఈ అదుపులను అసలు ఎరుగక పోవటం వల్ల, అటువంటి సంస్థలనుగాని, వాటికళలాలనుగాని అవశేషాలనుగానీ, ఎక్కడ ఉన్నప్పటికీ వాటిని తక్షణమే ధ్వంసంచేయటం జరిగింది. ఉత్తర భారతదేశంలో ఆదినుంచి అంతందాకా ఇదే జరిగింది. దక్షిణదేశంలో భారత రాజకీయ వ్యవస్థ చాల శతాబ్దాలు నిలిచి ఉన్నది కాని అక్కడి ప్రజాసభల రాజ్యాంగం ప్రాచీన రాజకీయ సంస్థల రాజ్యాంగం వంటివి కాక ఇతర సామాజిక సంస్థల, ప్రజాసభల రాజ్యాంగం వంటిదిగా ఉండేది. ఇవి వాటిని సమన్వయపరచి సర్వోచ్ఛ నియంత్రణ చేసే సాధనంగా వర్తించేవి. తక్కువ స్థాయికి చెందిన ఈ ప్రజాసభలలో, ఆరంభంలో రాజకీయ లక్షణాలు కలిగి కుల (Clan nation) గణాల (republic) సర్వోచ్ఛ నియంత్రణ సంస్థలు చేరి ఉండేవి. కొత్త విధానంలోగూడ వీటి ఉనికి కొనసాగుతూ వచ్చినా అత్యున్నతాధికారాన్ని కోల్పోయి, తమలోని భాగా

సూత్రంమీద ఆధారపడ్డ ఆర్థిక విభుల ఉపవిభజనలు ఆవశ్యకమైన కారణం చేత, వైశ్య శూద్రవర్ణాలు అసంఖ్యాకమైన జాతులుగా చీలి పోయినాయి మరింత కఠినంగా వారసత్వ సూత్రం అమలుకావటం అలా ఉంచి, ఈ నిశ్చిత విధి ఉపవిభజన, ఇతరదేశాలలో లాగా, పారిశ్రామిక సంఘ వ్యవస్థ ద్వారా వచ్చి ఉండేది : శక్తివంతము సమర్థము అయిన పారిశ్రామిక సంఘ వ్యవస్థ నగరాలలో ఉన్నట్లు విదితం అవుతుంది. అయితే తరువాతకాలంలో, పారిశ్రామిక సంఘ వ్యవస్థ మూలపడి మరింత సాధారణ సంస్థ అయిన జాతి, ఆర్థిక విధికి ప్రతిచోట ఆధారంగా పరిణమించింది. పట్టణంలో, పల్లెలో జాతి ప్రత్యేకత సామాజిక అంశంగా ఉండేది: ఒకే సారిగా మత, ఆర్థిక, రాజకీయ లక్షణాలతో కూడి, తనమత, సాంఘిక, తదితర సమస్యలను పరిష్కరించుకోవడమేగాక, స్వజాతివ్యవహారాలు నిర్వహించుకుంటూ, బయటి జోక్యం ఏ మాత్రమూలేని పరిపూర్ణ స్వేచ్ఛతో స్వజాతీయుల మీద చట్ట పరమైన అధికారాన్ని వహించేది. ధర్మానికి సంబంధించిన మౌలిక విషయాలు తలఎత్తినప్పుడు మాత్రం, శాస్త్రసంరక్షకులైన బ్రాహ్మణులకు ప్రామాణిక అర్థ నిశ్చయం కోసం, నిర్ణయంకోసం, పంపడం జరిగేది. కులం (Clan) లాగానే జాతికికూడా జాతిన్యాయం, జీవన నియమం, జాతి ధర్మం (Conduct) జాతి సంఘం (Cast communal assembly ) ఉండేవి. భారత రాజకీయ వ్యవస్థలోని సంస్థలన్నింటిలో వ్యక్తి గాక సమాజమే పునాదిగా ఉండేదికాబట్టి రాజ్యంలోని రాజకీయ పరిపాలనా విధి నిర్వహణలో జాతికి పరిగణన ఉండేది. దీనితో సమానంగ పారిశ్రామిక సంఘాలు స్వయం నిర్వాహక వ్యాపార, పారిశ్రామిక సామాజిక, సంస్థలుగా ఉంటూ, తమ వ్యవహారాలను తామే చర్చించుకొం

అపులు జరపటానికి సమావేశం అవుతూ ఉండేవి. ఇవిగాక ఒకప్పుడు పట్టణ పాలనా సంస్థలుగా ఉన్నట్లు కనిపించిన సంయుక్త సభలుకూడ వీటికి ఉండేవి. పారిశ్రామిక సంఘ ప్రభుత్వాలు అనదగిన ఈ సంస్థలు పురపాలక సంఘాలను మించినవిగా ఉంటూ అన్ని శ్రేణులకు చెందిన జాతుల సంఘాలు పారిశ్రామిక సంఘాలు రెండింటి సజీవ సమైక్యతకు ప్రాతినిధ్యం వహించే, మరింత సాధారణమైన నగర సంస్థలో తరువాత కాలంలో విలీనమైపోయాయి. రాజ్యంలో సాధారణ ప్రజాసభలో ప్రత్యక్ష ప్రాతినిధ్యం లేకపోయినా, స్థానిక వ్యవహారాలలో పరిపాలనలో వాటి స్థానం వాటికి ఉండేది.

ఈ వ్యవస్థకంతటికీ గ్రామీణ సమాజం, చిన్నపట్టణాలు సుస్పష్టంగా కనిపించే నిశ్చల ఆధారంగా ఉండేవి : ఇవి కేవలం ప్రాదేశిక విభాగాలు గానో, లేక ఎన్నికలు పరిపాలనా తదితర సాంఘిక రాజకీయ ప్రయోజనా లను నెరవేర్చటానికి సౌకర్యంచేకూర్చే యంత్రాంగంగానో ఉండేవికావని గమనించాలి. సావయవమైన స్వయం జీవనంతో రాజ్యయంత్రాంగానికి లోబడి ఉండే భాగంగా మాత్రమేగాక తమ స్వశక్తితో పనిచేసే నిజమైన సామాజిక ఏకతాంశాలుగా అవి వ్యవహరించేవి. గ్రామీణ సమాజాన్ని చిన్నగ్రామ గణతంత్ర సంస్థగా వర్ణించటం జరిగింది. ఈ వర్ణన అతి శయోక్తి అనటానికి వీలులేదు. కారణం, ప్రతి గ్రామం తన పరిమితులలో స్వయం పాలితంగా స్వయం సమగ్రంగా ఉండి ఎన్నుకొన్న పంచాయితీల చేత, ఎన్నికైన లేదా వారసత్వంగా వచ్చిన అధికారులచేత పాలించబడుతూ, తమ అవసరాలను తీర్చుకొంటూ, తనకు కావలసిన విద్య, పోలీసు న్యాయ విచారణ సంస్థలు, అన్ని ఆర్థిక అవసరాలను విధులను, సమకూర్చుకుంటూ స్వతంత్ర స్వయంపాలిత సంస్థగా తన జీవితాన్ని తానే నిర్వహించుకొంటూ ఉండేది. పలురకాల సమ్మేళనాలద్వారా ఈ గ్రామాలు తమ పరస్పర వ్యవ

హారాలను గూడ నిర్వహించుకొనేవి. ఎన్నికైన లేదా వంశ పారంపర్యంగా వచ్చిన అధిపతుల క్రిందఉన్న గ్రామ సముదాయాలు అంత సంపూర్ణంగా వ్యవస్థారూపంలో లేకపోయినా సహజ సిద్ధ సంస్థలుగానే వ్యవహరించేవి. భారతదేశంలోని చిన్నపట్టణాలు గూడా, అంతకంటే తీసిపోని స్వయం ప్రతిపత్తి స్వయం పాలన కల సంస్థలుగానే ఉండేవి. వాటిని పాలించటానికి వాటి ప్రజాసభలు, ఎన్నిక విధానంతో ఓటు వినియోగం ఉన్న కమిటీలు ఉండేవి. తమ వ్యవహారాలను అవి తమకు తామే నిర్వహించుకొంటూ గ్రామాల మాదిరిగా తాముకూడ రాజ్యంలోని సాధారణ ప్రజాసభకు తమ ప్రతినిధులను పంపించేవి. పౌరుల భౌతిక, భౌతికేతర శ్రేయస్సుకు దోహదం చేసే పోలీసు, న్యాయవిచారణలు, ప్రజాహిత కార్యక్రమాలు. పవిత్ర ప్రజోపయోగకర స్థలాల యాజమాన్యం, రిజిస్ట్రేషను, పురపాలక పన్నుల సేకరణ, వ్యాపార పారిశ్రామిక వాణిజ్యాలకు సంబంధించిన అన్ని విషయాలు పట్టణ పాలక ప్రభుత్వ పరిపాలనలో అంశాలుగా ఉండేవి. గ్రామీణ ప్రజానీకాన్ని చిన్న గ్రామ గణతంత్ర సంస్థగా వర్ణిస్తే పట్టణప్రాంత రాజ్య విధానాన్ని పెద్ద పట్టణ గణతంత్ర సంస్థగా వర్ణించవచ్చు. నైగమ పౌర ప్రజాసభలు—అంటే పారిశ్రామిక సంఘప్రభుత్వాలు, రాజధాని సంస్థలు-తమ నాణాలను తామే ముద్రించుకొనే ప్రత్యేక హక్కును గలిగి ఉండటం ప్రాముఖ్యతగల విషయం. ఈ అధికారం కేవలం రాజరిక వ్యవస్థలలో రాజులకు గణతంత్ర సంస్థలకు మాత్రమే ఉండేవి.

రాజకీయ అస్తిత్వం లేకపోయినా, తమలోని ప్రతిదీ ఒక స్వయం పాలిత సంస్థగా ఉన్న మరొక సమాజాన్ని మనం గమనించాలి. ఎందు కంటే, తన అభివ్యక్త రూపాలన్నింటిలో, ఒక సన్నిహిత సామాజిక అస్తిత్వంగా తన్నుతాను రూపొందించుకొనే భారతీయ జీవన ప్రవృత్తిని అవి స్పష్టపరుస్తాయి. ఒక ఉదాహరణ ఉమ్మడికుటుంబం. ఆధునిక పరిస్థితుల

ఒత్తిడి క్రింద ఇప్పుడిప్పుడే విచ్ఛిన్నం అవుతున్న ఈ సంస్థ భారతదేశంలో అంతటా వ్యాపించి ఉన్నది. దీనికి రెండు ప్రధాన లక్షణాలున్నాయి. మొదటిది, ఆస్తి పురుషసంతతి, వారి వారసుల ఉమ్మడి అధీనంలో ఉండటం, సాధ్యమైనంతవరకు కుటుంబ యజమాని ఆధ్వర్యంలో అవిభాజ్య సామూహిక జీవనం ప్రవర్తించటం. రెండవది తండ్రి ఆస్తిలో ప్రతి కుమారునకు, విడిపోయినప్పుడు గాని ఆస్తి విభజన జరిగినప్పుడు గాని అతనికి న్యాయంగా రావలసిన సమానమైన వాటా లభించటం అవ్యవహితమైన ప్రత్యేకహక్కుతో కలసి ఉన్న ఈ సామాజిక ఏకత్వం, భారతీయ మనఃస్థితి, జీవితం అవలంబించిన సమన్వయమార్గానికి, ప్రధాన ప్రవృత్తులను గుర్తించి, ఆచరణ ప్రమాణంలో అవి పరస్పర విరుద్ధాలుగా కనిపిస్తున్నా, వాటి మధ్య సామరస్యాన్ని నెలకొల్పే ప్రయత్నానికి ఇది ఒక ఉదాహరణ. ఇదే విధమైన సమన్వయ మార్గమే భారతీయ సామాజిక-రాజకీయ వ్యవస్థ సర్వ భాగాలలో, వేరు వేరు పద్ధతులలో, మతరాజ్య, రాజరిక, ధనికరాజ్య, ఉన్నతవంశీయపాలనా రాజ్య, ప్రజా స్వామ్య ప్రవృత్తులను ఒకే సమగ్రరూపంలో సంయోజనం చేయటం వైపు మొగ్గింది. ఈ రూపానికి దానిలో చేరిన వాటిలోని ఏ ఒక్కదాని లక్షణమూ లేదు: ఇది అదుపులు సమతూకాల వ్యవస్థ ద్వారా గాని వైజ్ఞానికంగా నిర్మించిన సమన్వయ పద్ధతి ద్వారా కాని ఏర్పడిన సర్దుబాటుగాని సమ్మేళనంగాని గాదు. జన్మ సిద్ధంగా ఉండే ప్రవృత్తులకు, సంశ్లిష్ట సాంఘిక మనఃస్థితి, స్వభావాల సహజశీలానికి అది ఒక సహజ బాహ్యరూపం.

ఇక ఆ చివరలో, భారతీయ జీవ మనఃస్థితికి సన్న్యాస స్వేచ్ఛ ఆధ్యాత్మిక అంతిమదశగా మతసమాజం కనిపిస్తుంది. మళ్ళీ ఇది గూడా సామాజిక రూపాన్ని పొందింది. అదిమ వేదకాలసమాజంలో చర్చికిగాని మతసమాజానికిగాని పారంపరిక మతాధికార వ్యవస్థకుగాని చోటు లేదు.

ఎందుకంటే దాని వ్యవస్థలో ప్రజాసముదాయం అంతా, మతపరులు లౌకికులు, సామాన్యులు, పురోహితులు అనే భేదాలు లేని ఒకే ఒక సాంఘిక మత సమగ్రతగా ఉండేది. తరువాతి పరిణామాలు ఏమైనప్పటికీ, మొత్తం మీద లేదా కనీసం మూలాధారంగా, హిందూమతం ఈ సూత్రానికి కట్టుబడి ఉంటున్నది. దీనికి విరుద్ధంగా కాలక్రమంలో, మతజీవితాన్ని ప్రాపంచిక జీవితాన్నుంచి వేరు చేయటానికి, ప్రత్యేక మతసమాజసృష్టికి దారి తీయటానికి వచ్చిన అధిక సన్న్యాస ప్రవృత్తిని బౌద్ధ జైన మతాలు, శాస్త్రాలు ధృవపరచాయి. బౌద్ధమత వ్యవస్థ, వ్యవస్థీకృతమైన మతసమాజ సంపూర్ణస్వరూపానికి మొదటిఘట్టం. బుద్ధుడు భారతదేశసంఘ రాజకీయవ్యవస్థల సర్వవిదిత సూత్రాలనే యథాతథంగా సన్న్యాసజీవితానికి వర్తింపజేసినట్లు కనిపిస్తుంది. తన వ్యవస్థ ధర్మసంఘంగా ఉండాలని, బౌద్ధులకు అవగాహన అయిన ధర్మానికి అభివ్యక్తరూపంగా, దాని నియమాలలో లక్షణాలలో జీవిత నిర్మాణంలో ధర్మనిర్వహణమీద ఆధారపడేదిగా ఉండే సమైక్య సామూహిక సంస్థగా జీవించే మతసంఘంగా ప్రతిమతము ఉండాలని ఆయన ఉద్దేశించాడు. మొత్తం హిందూసమాజ సూత్రం సిద్ధాంతం కచ్చితంగా ఇదేనని మనకు వెంటనే స్పష్టమవుతుందికాని ఇక్కడ ఆధ్యాత్మిక జీవితానికి స్వేచ్ఛమైన మతసంస్థకు వీలైనంత ఎక్కువ తీవ్రతను ఆపాదించటం జరిగింది. ఇదికూడా తన వ్యవహారాలను భారతీయ సాంఘిక రాజకీయ సామాజిక సంస్థల లాగానే నిర్వహించుకొనేది. ఈ మత వ్యవస్థకు చెందిన ప్రజాసభ ధర్మసంబంధమైన వివాదాస్పద అంశాలను, దాని అనువర్తనను చర్చించటమేగాక, గణతంత్ర సమావేశభవనాలలో లాగానే ఓటు పద్ధతి ననుసరించి నడిచేది, కాని స్వేచ్ఛ ప్రజాస్వామ్య పద్ధతులవల్ల రాగల దుష్టపరిణామాలను నివారించేటందుకుగాను కొంతవరకు పరిమిత నియంత్ర

ణకు లోబడి ఉండేది. ఒకసారి ఆ విధంగా స్థిరంగా స్థాపించిన మత వ్యవస్థను. దాని విస్తార నిర్మాణాన్ని మినహాయించి, పూర్వాచారపరాయణమతం స్వీకరించింది. ప్రాచీన బ్రాహ్మణవ్యవస్థకు ఎదురు నిలువగలిగిన ప్రతిచోటా ఈ మతసమాజాలు, శంకరాచార్యులు సృష్టించిన ఆశ్రమవ్యవస్థలో లాగా, సామాన్య ప్రజానీకానికి పరంపరానుగత మతాధిపత్యాన్ని వహిస్తూ ఉండేవి కాని, అవి రాజకీయస్థానం కోసం ఎగబాకలేదు. భారతరాజకీయచరిత్రలో చర్చికి, రాజ్యవ్యవస్థకు మధ్య సంఘర్షణ తలఎత్త నేలేదు.

ప్రాచీన భారతదేశంలోని సర్వజీవితం గొప్ప రాజ్యాల, సామ్రాజ్యాల కాలంలో కూడా తన ప్రథమ సూత్రాన్ని, సారభూతవర్తనాన్ని నిలబెట్టుకొన్నట్లు దీనివల్ల మనకు స్పష్టపడింది. దాని సాంఘిక రాజకీయ వ్యవస్థ ప్రధానంగా స్వయంనిర్ణీత స్వయంపాలిత సామాజిక సంస్థల సంశ్లిష్టనిర్మాణంగా ఉండిపోయింది. ఈవ్యవస్థమీద, సువ్యవస్థిత రాజ్యాధికారం వెనువెంటనే రావలసిన అవసరం ఏర్పడటానికి ఇతరచోట్లలో లాగానే భారతదేశంలో కూడా, కొంతవరకు వదులైన సహజ జీవన సమన్వయ మార్గానికి బదులు, కొద్ది ప్రదేశాలలో తప్పించి సాధ్యంకాని, కఠినశాస్త్రీయ సమర్థ సమన్వయమార్గాన్ని ఆచరణాత్మక హేతువు వాంఛించటం కారణం కాగా, సువ్యవస్థిత సైనిక దురాక్రమణ, ఆత్మరక్షణ అంతర్జాతీయ చర్యలు ఒకేఒక కేంద్రాధికారం చేతిలో కేంద్రీకృతం కావలసిన అవసరం మరింత అనివార్య కారణం అయింది. స్వేచ్ఛా గణతంత్ర రాజ్యవిస్తరణ మొదటి కోరిక నెరవేరటానికి సరిపోయేది ; దానిలో అంతర్గతశక్తి, కావలసిన సంస్థలు ఉన్నాయి. కాని, కుదించబడి తేలికగా గోచరించే కేంద్రీయశీల రాజరిక రాజ్యపద్ధతి మరింత సిద్ధమైన నిర్వహణ సులభమైన సాధనంగానూ, సునాయాసంగా పని చేసేదిగానూ పైచూపులకు సమర్థ యంత్రాంగం

గానూ కనిపించింది. దాదాపు ప్రారంభంనుంచే దీర్ఘకాల క్లిష్ట సమస్యగా ఉన్న-అప్పటికి ఒకదేశంగా కాక ఒక ఖండంగా ఉన్న భారతదేశ రాజకీయ సమైక్యతా సాధన అనే బాహ్యవిధిని నిర్వర్తించటానికి ఎంతటి సమర్థమైన సైనిక వ్యవస్థ ఉన్నప్పటికి, ఆత్మరక్షణకేగాని దురాక్రమణకు అంతగా సరిపడని గణతంత్రవ్యవస్థ చాలలేదు. ఈకారణం వల్ల ఇతరచోట్ల లాగానే భారతదేశంలో కూడా బలిష్ఠ రాజరిక వ్యవస్థ ప్రాబల్యాన్ని వహించి మిగిలినవాటిని కబళించివేసింది. అదే సమయంలో తన ప్రధాన సంస్థలు, ఆదర్శాల పట్ల భారతీయ మనస్థితికి ఉన్న విధేయత ప్రజాస్వభావానికి సహజమైన సామాజిక స్వయంపాలన మూలాధారాన్ని సంరక్షించుకోవటమే గాక, రాజరిక వ్యవస్థ నిరంకుశ పాలనగా పరిణమించకుండ, తన సముచిత విధులను అతిక్రమించకుండ నివారించి సమాజ జీవితాన్ని యాంత్రికంచేసే మార్గంలో పోకుండా జయప్రదంగా దానికి అడ్డు నిల్చింది. రాజరిక ప్రభుత్వానికి, స్వయం నిర్ణీత ప్రజా సామాజిక జీవితానికీ మధ్య నిలబడిన స్వేచ్ఛా సంస్థలు అంతరించిపోవటానికో లేక పూర్వపు శక్తిని జీవాన్ని చాలావరకు కోల్పోవటానికో ఉన్ముఖం కావటం దీర్ఘకాల క్షీణదశలో మాత్రమే జరిగింది. వ్యక్తిగత ప్రభుత్వం, వ్రాతగాండ్ర అధికారులతో కూడిన ఉద్యోగి వర్గపాలన, గణనీయ పరిమాణంలో కొంతవరకు అభివ్యక్తం కావటం ప్రారంభమైన కేంద్రీకృత అధికారప్రాబల్యం, వంటి దుష్ట పరిణామాలు సంభవించాయి. ప్రాచీన భారత రాజకీయ వ్యవస్థా సాంప్రదాయాలు నిలిచి ఉన్నంతవరకు, అవి సజీవంగా సమర్థంగా ఉన్న పరిమాణంలో, ఈ దుష్ఫలితాలు అప్పుడప్పుడు లేదా అక్కడక్కడ ఉండేవి ; లేక అంత ప్రమాదకర పరిమాణాన్ని పొందేవికావు. విదేశీ దండ

యాత్రలు ఆక్రమణలతోపాటుగా ప్రాచీన భారతీయ సంస్కృతి నెమ్మదిగా క్షీణించి చివరకు పతనావస్థ చేరటంతో పాతకట్టడంలోని గణనీయ భాగాలు కూలిపోవటం, విచ్ఛిన్నంకావటం హీనస్థితిని పొందటం జరిగింది. ప్రజల సాంఘిక రాజకీయ జీవితాన్ని పునరుజ్జీవింప జేయటానికి పునర్నిర్మించ టానికి సరిపోయిన సాధనాలు లేకుండాపోయినాయి.

భారతీయ నాగరికతా పరిణామం మహోన్నత స్థితిలో ఉన్న స్వర్ణ యుగంలో అత్యుత్కృష్ట సామర్థ్యం కలిగి సామాజిక స్వయం పాలనతో నిలకడను క్రమబద్ధతను సంపూర్ణంగా మేళవించిన ప్రశంసనీయమైన రాజ కీయ వ్యవస్థ ఉన్నట్లు విదితం అవుతుంది. రాజ్యవ్యవస్థ తన పాలనా, న్యాయ, విత్త, రక్షణ కార్యాలను, ప్రజల స్వేచ్ఛా కార్యకలాపాలను గాని హక్కులనుగాని ఆయాశాఖల సంవిధాన సంస్థల కార్యకలాపాలను గాని హక్కులను గాని నాశనం చేయకుండా అనుచితంగా ఆక్రమించుకోకుండా నిర్వర్తించేది. రాజధానిలోను దేశవ్యాప్తంగాను ఉన్న రాజదర్బారులు రాజ్యవ్యాప్తంగా న్యాయ నిర్వహణను సమన్వయం చేసే అత్యున్నత న్యాయాధికార సంస్థగా ఉండేవి. కాని గ్రామీణ పట్టణ సమాజాలు తమ సొంత దర్బారులకు అప్పగించిన న్యాయాధికారాలలో ఇవి అనుచిత జోక్యం చేసు కొనేవికావు: రాజవ్యవస్థ కూడ వ్యక్తుల మధ్యవర్తి పరిష్కార సాధనంగా పారిశ్రామిక సంఘం, జాతి, కుటుంబ న్యాయస్థానాలను తనతో అనుసం ధించుకొనేది: అత్యంత ప్రమాదకరమైన అపరాధాల విషయాలలో మాత్రం స్వీయ ప్రత్యేక నియంత్రణ కోసం పట్టు పట్టేది. గ్రామీణ పట్టణ సమా జాల పరిపాలనా విత్త అధికారాల, పట్లకూడా ఇటువంటి గౌరవాన్నే ప్రద ర్శించేది. పుర గవర్నర్లు అధికారులు, ప్రజలు వారి ప్రతినిధి సభలు నియమించిన సామాజిక అధిపతులు అధికారులతో పాటుగా రాజు గారి గవర్నర్లు అధికారులు, నగరంలో గ్రామంలో కూడా ప్రక్క ప్రక్కనే,

ఉండేవారు. జాతి మత స్వేచ్ఛలోగాని, సుస్థిరంగా ఉన్న ఆర్థిక సాంఘిక జీవనంలోగాని రాజ్యవ్యవస్థ జోక్యం కలిగించుకొనేదికాదు. సాంఘిక వ్యవస్థను నిలబెట్టటానికి, అవసరానికితగ్గట్టు పర్యవేక్షణ, సహాయం సమన్వయం అందజేయటానికి, జాతి కార్యకలాపాలను సుసంపన్నంగా, శక్తివంతంగా నిర్వహించటానికి ఆవశ్యకమైన వసతులను సమకూర్చటానికి మాత్రమే అది పరిమితమై ఉండేది. భారత దేశ సామాజిక మనఃస్థితి అప్పటికే సృష్టించి పెట్టిన భవనశిల్ప, కళా, సాంస్కృతిక, పాండిత్య సాహిత్యాలను అది ఎల్లప్పుడూ అవగాహన చేసుకోవటమేగాక వితరణశీలమైన ప్రోత్సాహానికి మూలాధారమై లభించిన అవకాశాలను బ్రహ్మాండంగా సద్వినియోగం చేసుకొన్నది రాజు వ్యక్తిత్వంలో తెలివిగల, శక్తివంతుడైన అధిపతి అతని పరిపాలనా వ్యవస్థలో నిరంకుశ రాజ్యాధికారమో ఉద్యోగి వర్గ పాలనమోగాని, జీవితాన్ని అణగద్రొక్కి లేదా దాని స్థానాన్ని తానే ఆక్రమించిన యంత్రాంగంగాని లేకుండా ఒక సుస్థిర మహా నాగరికతకు చెందిన స్వేచ్ఛా జీవాలు తొణికిసలాడే ప్రజల అత్యుత్కృష్ట పరికరం దర్శనమిచ్చేవి.

# 4

భారత సాంఘిక–రాజకీయ వ్యవస్థ లక్షణాన్ని మూలసూత్రాన్ని సరిగా అవగాహన చేసుకొని దాని వాస్తవాలను గురించిన సరియైన జ్ఞానాన్ని కలిగి ఉంటే, భారతీయుల మనఃస్థితి వేదాంత, మత, కళా, సాహిత్య రంగాలలో అసాధారణమైనప్పటికీ, జీవితాన్ని సువ్యవస్థితం చేయటానికి సరిపోదనీ, ఆచరణజ్ఞానం కావలసిన పనులలో హీనమైనదనీ, రాజకీయ ప్రయోగాలలో ముఖ్యంగా అది నిష్ఫలమైపోయిందనీ, రాజకీయ నిర్మాణాలలో ఆలోచనా కార్యనిర్వహణలో అది సాధించినదేదీ లేదనీ పాశ్చాత్య విమర్శకులు చేసే వాదానికి వెంటనే సమాధానం చెప్పవచ్చు. ఈ విమర్శకులు చెబుతున్నదానికి విరుద్ధంగా భారతీయ నాగరికత ప్రశంసనీయమైన రాజకీయ వ్యవస్థను పెంపొందించటమేగాక, శాశ్వతమైన దార్ఢ్యాన్ని కలిగి ఉండేటట్లు దానిని స్థిరంగా నిర్మించి పౌరపాలనానిర్మాణ ప్రయత్నాలలో మానవ మనఃస్థితి ఆకాంక్షించిన రాజరిక, ప్రజాస్వామ్య తదితర వ్యవస్థల మూలసూత్రాలను ఆశయాలను ఎంతో నేర్పుగా మేళవించి, అదే సమయంలో ఆధునిక యూరపియన్ రాజ్యవ్యవస్థలో ప్రధాన లోపంగా కన్పిస్తున్న మితిమీరిన యాంత్రికతనుంచి తప్పించుకోగలిగింది. పాశ్చాత్య పరిణామ దృక్పథం నుంచి, దాని అభ్యుదయభావ దృక్పథం నుంచి వచ్చే అభ్యంతరాలను తరువాత పరిశీలించగలను.

భారత రాజకీయ మనఃస్థితి వైఫల్యాన్ని తప్ప దేనినీ వ్యక్తపరచటం లేదని చెప్పటానికి ఆధారం కల్పించే మరొక రాజకీయ దృష్టి ఉన్నది. అది వృద్ధిచేసిన వ్యవస్థ ప్రశంసనీయ స్థిరత్వాన్ని, సమర్థ పరిపాలనము అందించి ఉండవచ్చు ; సామాజిక వ్యవస్థను, స్వేచ్ఛలను ఆనాటి

పరిస్థితులలో ప్రజాసంక్షేమాన్ని సమకూర్చి ఉండవచ్చు; దాని ప్రజా సముదాయాలలో దేని కది స్వయంపాలితమై, సుపరిపాలితమై, సంపన్నమై ఉండవచ్చు; అత్యున్నతాభివృద్ధి చెందిన సంస్కృతీ నాగరికతలు నిలకడగా వ్యవహరించటం దేశంమొత్తంమీద నిశ్చయంగా జరిగి ఉండవచ్చు. అయినప్పటికీ ఈ వ్యవస్థ భారత జాతీయ రాజకీయ సమైక్యతకోసం పాటుబడటంలో విఫలమైపోయింది; చివరకు పరదేశీ దండయాత్రలనుంచి, వ్యవస్థలు ఛిన్నాభిన్నం కావటం నుంచి, యుగయుగాల బానిసత్వంనుంచి తన్ను తాను రక్షించుకోలేకపోయింది. ఒక సమాజంలోని రాజకీయ వ్యవస్థను అంచనా కట్టటానికి, అన్నింటికన్న ముందుగా ముఖ్యంగా, దాని నిలకడ సంపన్నత, ప్రజలకు అది సమకూర్చే అంతర్గత స్వేచ్ఛ క్రమబద్ధతలను పరిగణించవలసిందే కాని, పరరాజ్యాలనుంచి రక్షణకోసం అది నిలబెట్టిన భద్రతా వ్యవస్థ, దాని సమైక్యత, బాహ్య ప్రతిస్పర్థులమీద శత్రువులమీద దాడి చేయగలవారినుండి తన్ను తాను రక్షించుకోగల శక్తినిబట్టి గూడ దాన్ని అంచనా కట్టాలి. ఇది బహుశః మానవజాతికి ప్రతిష్ఠావహమైనది కాకపోవచ్చు. ఇటువంటి రాజకీయబలం దృష్ట్యా హీనస్థితిలో ఉన్న ప్రాచీన గ్రీకు మధ్యయుగంనాటి ఇటలీవంటి జాతి (Nation) గాని ప్రజలు గాని తమ విజేతలకంటె ఆధ్యాత్మిక సాంస్కృతిక ఉన్నతస్థితి కలిగిఉండవచ్చు. విజయసాధక సైనిక రాజ్యాలకన్న, దురాక్రమణ పరాయణ సమాజాలకన్నా, పరపీడక మహారాజ్యాలకన్నా అవి మానవజాతి పురోగతికి ఎంతో దోహదం చేసి ఉండవచ్చు. కాని మానవజీవితం, ప్రముఖంగా, ఇంకా ప్రాణికంగానే ఉన్నది కనుక, దాని కదలిక, విస్తరణ, స్వాధీనత, దురాక్రమణ, విలీన జీవప్రక్రియల పరస్పర సంఘర్షణల మీద ఆధారపడి

ఉంటుంది. జీవన ప్రథమసూత్రానికి ఆలంబన ఇవే. దురాక్రమణ, ఆత్మ రక్షణ చర్యలలో తన అసమర్థతను నిరంతరం నిరూపిస్తూ, స్వక్షేమానికి కావలసిన కేంద్రీకృత, సమర్థ ఏకత్వాన్ని నెలకొల్పలేని సామూహిక మనోచైతన్యాలు రాజకీయరంగంలో ఈ ప్రథమ సూత్రానికి సరిపోవు. భారతదేశం జాతీయంగా రాజకీయంగా ఒక్కటిగా ఎన్నడూ లేదు. దగ్గర దగ్గర వేయి సంవత్సరాలు అనాగరికుల జాతుల దాడికి భారతదేశం గురి అవుతూ వచ్చింది. మరొక వేయి సంవత్సరాలు వరసగా విదేశీ ప్రభువులకు దానిసగా ఉండిపోయింది. అందుచేత భారతప్రజలకు రాజకీయ సామర్థ్యం కొరవడిందనే తీర్పు నివ్వటం తప్పదని స్పష్టపడింది.

ఆసలు వాస్తవాలను గురించి వాటి ప్రాముఖ్యతను గురించి స్పష్టమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకోవటానికి, భారతదేశ సుదీర్ఘ చరిత్రలో సరియైన పరిష్కారం దొరకలేదని అందరూ అంగీకరించిన సమస్యలో ఇమిడి ఉన్న ప్రవృత్తులను, సూత్రాలను అవగాహన చేసుకోవటానికి ఇక్కడ మళ్ళీ మనం ముందుగా చెయవలసింది అతిశయోక్తులను పరిహరించటం. మొదటగా, ఒక ప్రజానీకం లేక నాగరికత మహత్త్వానికి, దాని సైనిక దురాక్రమణ తత్వం ఆది జరిపిన విదేశీ ఆక్రమణలు, పరదేశాలతో చేసిన యుద్ధాలలో అది సాధించిన విజయం, దాని ఆర్జన హింసా ప్రవృత్తుల వ్యవస్థీకరణ పొందిన దిగ్విజయాలు, ఆక్రమణ దోపిడీల వైపుకు దాని దుర్నివార వేగం ఇవే కొలమానాలైతే ప్రపంచంలోని గొప్ప జాతుల జాబితాలో భారతదేశం బహుశః అట్టడుగున ఉన్నదని ఒప్పుకొనవలసివస్తుంది భారతదేశం తన సరిహద్దులు దాటి ఏనాడూ సైనిక దండయాత్రలను రాజకీయ విస్తరణను జరిపినట్లు కనిపించదు: భారతదేశం సాధించిన విజయ గాథలో ప్రపంచాధిపత్య ఇతిహాసం, సుదూరప్రాంతాల ఆక్రమణ, వలస రాజ్యాలను విస్తరింపజేయటం వంటి గొప్ప కథలు వ్రాసిలేవు. భారతదేశం

తలపెట్టిన విస్తరణ, విజయయాత్ర, దురాక్రమణల ఏకైక ప్రయత్నం, తన సంస్కృతి విస్తరణ, బౌద్ధమత భావాలతో ప్రాచ్య ప్రపంచం మీద ఆక్రమణ విజయయాత్రలను నిర్వహించటం, తన ఆధ్యాత్మికత, కళ, ఆలోచనా శక్తులు చొచ్చుకొని పోవటం మాత్రమే. ఇది శాంతి యాత్ర-యుద్ధయాత్రకాదు. కారణం, బల ప్రయోగం భౌతిక విజయాల ద్వారా ఆధ్యాత్మిక నాగరికతను విస్తరింపచేయటం ఆధునిక సామ్రాజ్యవాదం చెప్పేసాకు లేదా డంబం భారతీయ ప్రాచీన మనః స్థితికి స్వభావానికి, తన ధర్మంలో అంతర్లీనంగా ఉన్న భావానికి సమ్మతమైనదికాదు. వలసలు స్థాపించే యాత్రా పరంపరలు భారతీయ రక్తాన్ని, సంస్కృతిని సుమార ద్వీప సమూహాలకు తీసికొని పోయినాయి కాని తూర్పు పడమటి సముద్ర తీరాలనుంచి బయలు దేరిన ఓడలు, దూర దేశాలను ఒక భారత సామ్రాజ్యంలో కలుపుకొనే లక్ష్యంతో కదలిపోయిన దురాక్రమణ పరుల నావికబలం కాదు. ఇంకా అనాగరికులుగా ఉండిపోయిన వారికి భారతీయ మతాన్ని, భవనశిల్పాన్ని, కళను, కవితను, ఆలోచనను, జీవనసరళిని, ఆచారాలను తీసుకొని వెళ్ళే ప్రవాసులను సాహసయాత్రికులను అవి తీసుకొని వెళ్ళాయి. సామ్రాజ్య భావన మాత్రమేగాక ప్రపంచ సామ్రాజ్య భావన కూడ భారతీయ మనఃస్థితిలో లేకపోలేదు. కాని దాని ప్రపంచం భారత ప్రపంచం : దాని లక్ష్యం తనప్రజల సామ్రాజ్య సమైక్యతను సంస్థాపించటం.

ఈ భావన, ఈ ఆవశ్యకతా స్పృహ, దాని అనుభవప్రాప్తికోసం సర్వదా చెలరేగిన తీవ్రవాంఛ, తొలినాటి వేదకాలంతో ఆరంభించి, రామాయణ మహాభారత సాంప్రదాయాలను, సామ్రాజ్యస్థాపకులైన మౌర్యగుప్త రాజుల కృషినుంచి మొగలాయి సమైక్యతకు, పీష్వాల కడపటి ఆశయానికి ప్రాతినిధ్యం వహించిన వీరయుగం ద్వారా భారతదేశచరిత్రలో అసాం

తం అంతిమమై ఫల్యం సంభవించేవరకు. సంఘర్షకశక్తులన్నీ ఒక పిదేశ దాస్యంక్రింద అణగారేవరకు. స్వేచ్ఛాప్రజల స్వేచ్ఛాసమైక్యత స్థానంలో ఏకరూప పదేయత నెలకొనేవరకు ప్రస్ఫుటం అవుతూ వచ్చింది. ఈ మందగమనానికి, క్లిష్టతకు, ప్రక్రియలోని ఒడిదుడుకులకు దీర్ఘకాలకృషి భగ్నం కావటానికి ప్రజల నాగరికతలోగాని, రాజకీయ చైతన్యంలో గాని సామర్థ్యంలోగాని ఉన్న ప్రధాన లోపం కారణమా లేక మరింకేవైనా శక్తులు కారణమా అనేపి ఇప్పుడు ప్రశ్న, భారతీయులు ఏకంకాకపోవటాన్ని గురించి, వారందరికీ సామాన్య దేశభక్తి లేకపోవటాన్ని గురించి-పాశ్చాత్య సంస్కృతి ప్రభావంవల్ల ఇవి ఇప్పుడిప్పుడే జన్మిస్తున్నాయని అంటున్నారు. మతం జాతి సృష్టించిన విభజనలను గురించి ఎంతో చెప్పటం వ్రాయటం జరిగింది. ఈ అభిశంసనలలో, వాటి పూర్తి స్థాయిలో, శక్తి ఉన్నదని అంగీకరించినా - నిజానికి ఇవన్నీ నిజంకావు సరిగా చెప్పినవికావు, ప్రస్తుతాశానికి అంత పెద్దగా అన్వయించేవీకావు-అవి కేవలం బాహ్యలక్షణాలు. లోతైనకారణాలు ఇంకామనం అన్వేషించాలి.

భారతదేశాన్ని సమర్థించేవారు సర్వసాధారణంగా చెప్పేసమాధానం, భారతదేశం అనేక జాతులకు నివాసమైన దాదాపుగా యూరప్ అంత విస్తారమైన ఖండం అనీ, ఈ కారణంగా ఈ సమస్యవల్ల వచ్చే ఇబ్బందులుకూడా, అంత పెద్దవి, కనీసం అంతిగణనీయమైనవి అనీ, యూరోపియన్ సమైక్యతా భావన ఇప్పటికీ ఆదర్శ భూమికలో వ్యర్థమైన భ్రమకల్పనగానే మిగిలి పోవటానికి ఈ నాటికీ ఆచరణసాధ్యం కాకపోవటానికి పాశ్చాత్య నాగరికత లోని అసంపూర్ణత, యూరప్ ప్రజల రాజకీయ అసమర్థత కారణం అన టానికి రుజువులేదు. అయినప్పుడు అంతకన్న విస్పష్టంగా కనిపిస్తున్న ఏకత్వానికి కనీసం ఏకీకరణానికి, దానిని సాధించటానికి జరిగిన నిరంతర యత్నానికి భారత ప్రజల చరిత్రలో గమనార్హమైన ఈ కృషి దాదాపుగా

పిఅయంకావటానికి, వేరే పిలువల కొలమానాన్ని ప్రయోగించటం న్యాయం కాదు. ఈ వాదంలో కొంత బలం లేకపోలేదు కాని ఈ రూపంలో అది సముచితంగాలేదు. ఎందుకంటే ఈ సాదృశ్యం పరిపూర్ణమైనదికాక పోగా పరిస్థితులు కూడ ఆ క్రమంలోలేవు. యూరోపియన్ దేశాలు తమ సామూహిక వ్యక్తిత్వంలో పరస్పరం తీవ్ర భిన్నత్వానికి లోనై ఉన్నాయి. వాటికి క్రిష్టియను మతం ద్వారా లభించిన ఆధ్యాత్మిక ఏకత్వంగాని, సామాన్య యూరోపియన్ నాగరికత వల్ల లభించిన సాంస్కృతిక ఏకత్వంగాని భారత దేశ ప్రాచీన ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వంలాగా ఎన్నడూ యదార్థమైనదిగా లేదు, పూర్ణంగా లేదు. అది వాటి జీవన కేంద్రంగా ఎప్పుడూలేదు. వాటి అస్తిత్వానికి అది ఆధారంకాదు, దృఢ భూమికాదు అది ఏకత్వానికి ఆధారభూమికగా కాక, కేవలం దాని సాధారణ వాయువుగా దాని చుట్టూ ఆవరించిన వాతావరణంగా ఉన్నది దాని అస్తిత్వానికి ప్రతిదేశంలోను వేరుగా ఉన్న రాజకీయ ఆర్థిక జీవితం ఆధారంగా ఉన్నది. రాజకీయ చైతన్యానికి పాశ్చాత్య మనఃస్థితిలో ఉన్న ఈ బలమే, యూరపు బహుధా విభక్త, యుద్ధపరతంత్ర దేశ సముదాయంగా ఉండేటట్లు చేసింది. పెరుగుతున్న రాజకీయోద్యమ సముదాయం, ఇప్పటికీ యూరప్ అంతటా పూర్తిగా నెలకొన్న ఆర్థిక పరస్పర ఆధార స్థితి-వీటి వల్లనే ఇంకా శైశవదశలో ఉన్న సామర్థ్యహీనమైన "నానారాజ్యసమితి" రూపొందింది. తర తరాలుగా సంక్రమించిన వేర్పాటు తత్వంలో పుట్టిన మన స్తత్వాన్ని యూరప్ జాతుల సామాన్య ప్రయోజనాలకు వర్తింపచేయాలని ఇది వ్యర్థ ప్రయత్నంచేస్తున్నది. కాని భారతదేశంలో చాలా తొలిదశలోనే ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వం పరిపూర్ణస్థితి పొందింది. హిమాలయాలు రెండు మహా సముద్రాల

మధ్య ఉప్పొంగిన మానవజాతి జీవితానికి అదే మూలవస్తువు అయింది. ప్రత్యేక రాజకీయ ఆర్థిక జీవితాలు కారణంగా, ప్రాచీన భారత ప్రజలు విభిన్న జాతులుగా ఎన్నడూ విడిపోలేదు. భౌతికంగా సముద్రాలు, పర్వతాల వల్ల ఇతర దేశాలనుంచి, ప్రగాఢ ప్రత్యేకతాజ్ఞానం ఒక విచిత్ర సామాన్య మత సంస్కృతుల వల్ల ఇతర జాతులనుంచి, వేరుగా ఉన్న ఒక మహా ఆధ్యాత్మిక సాంస్కృతిక జాతిలో అంతస్సమాజాలుగా మాత్రమే వారు మనుగడ సాగించారు. ఎంత సువిశాలమైనా, ఆచరణలో కష్ట నష్టాలు ఎన్ని వచ్చినా యూరపులోకంటె సులభంగా భారతదేశంలో రాజకీయ సమైక్యత వచ్చి ఉండవలసింది. ఈ వైఫల్యానికి కారణాన్ని ఇంకా లోతుగా పోయి వెదకాలి. ఈ సమస్యను ఊహించిన, ఊహించి ఉండవలసిన తీరుకు, ఈ ప్రయత్నానికి వాస్తవంలో ఇచ్చిన మలుపుకు మధ్య వైషమ్యం, ఈ మలుపు నిష్పటంలో వ్యక్తమైన ప్రజల విచిత్ర మానసిక స్థితిలో వైరుధ్యం ఈ వైఫల్యానికి కారణమని కనుగొంటాము.

భారతీయ మనః స్థితి సంపూర్ణాధారం దాని ఆధ్యాత్మికత్వం, అంతర్ముఖత్వం : ప్రథమంగా, ప్రధానంగా వస్తువుల ఆత్మకు అంతఃస్థితికి చెందిన విషయాలను అన్వేషించి, తక్కిన దానినంతా అప్రధానంగా, పరాశ్రయంగా, ఉన్నత విజ్ఞాన ప్రకాశంలో నిర్వహించి నిశ్చయించవలసిందిగా, గంభీరమైన ఆధ్యాత్మికాశయానికి ఒక ప్రకటనగా, తొలిమెట్టుగా, భూమికగా, సహాయంగా కనీసం అనుబంధంగా చూచే ప్రవృత్తి-ఈ కారణంగా తాను దేనిని సృష్టించినా, మొట్ట మొదట అంతరంగ భూమికలో సృష్టించి అ తరువాతనే ఇతరాంశాలలో సృష్టించే ప్రవృత్తి. ఈ మనస్తత్వం వల్ల, దీని ఫలితంగా అంతరంగం నుంచి బాహ్యానికి సృష్టించే ప్రవృత్తి వల్ల,

భారతదేశం తన కోసం సృష్టించుకొన్న ఏకత్వం విధిగా, ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వం కాక తప్పదు. ముందు, విజయశీలరాజ్యం లేదా సైనిక, వ్యవస్థీకృత ప్రజల అసాధారణ ప్రజ్ఞ వల్ల రోము ప్రాచీన పర్షియా లలో వలె బలాత్కారంగా విధించిన లేదా నిర్మించిన కేంద్రీకృత బాహ్య పరిపాలన ఏర్పరచిన రాజకీయ సమైక్యత మాత్రం అది కాజాలదు. దీనిని ఒక తప్పిదంగా. లేదా అచరణయోగ్యం కాని భారతీయమనః స్థితి లక్షణా నికి రుజువుగా పేర్కొనటం, ముందుగా ఒకే ఒక రాజకీయ సంస్థను నిర్మించి ఉండవలసిందని ఆ తర్వాత భారతీయ సువిశాల సామ్రాజ్య శరీరంలో, ఆధ్యాత్మిక ఏకత్వం భద్రంగా వృద్ధి పొందగలిగేదని చెప్పటం న్యాయం కాదని నేననుకుంటాను. ఆరంభస్థితిలో, వందకు పైబడిన రాజ్యాలు, కులాలు (Clans), ప్రజాసముదాయాలు, తెగలు. జాతులు (Castes) ఒక మహా సువిశాల భూభాగంలో నివసించటం ఒక సమస్యగా ఉండేది. ఈ దృష్టిలో, ఇది మరొక గ్రీసుదేశం, కాని అపరిమిత విస్తృతి కలిగి దాదాపు ఆధునిక యూరపు అంతటి పెద్ద గ్రీసుదేశం. ప్రధాన ఏకత్వ భావనను కలిగించటానికి, గ్రీసులో మాదిరిగా, ఒక సాంస్కృతిక (హెల్లెనిక్) గ్రీకు సమైక్యభావన అవసరం. ఇక్కడకూడా, అత్యావస రంగా ఒక బుద్ధి పూర్వకమైన ఈ జాతులన్నింటి ఆధ్యాత్మిక సాంస్కృ తిక ఏకత్వమే మొట్టమొదటి అని వార్యమైన షరతు, ఇది లేనిది కలకాలం నిలిచి ఉండగల ఏకత్వం సాధ్యంకాదు. ఈ విషయంలో భారతీయ మనః స్థితిలో దాని సంస్కృతి నిర్మాతలైన మహర్షులలో కల అంతర్బుద్ధి పటిష్ఠ మైనది. తొలినాటి భారతీయ సంఘాలలో రోములోలాగా, సైనిక రాజకీయ మార్గాల ద్వారా బాహ్య సామ్రాజ్య సమైక్యతను స్థాపించటం సాధ్యపడి

ఉండేదని మనం అనుకొన్నా, రోము ఏకత్వం, యుద్ధ విజయాలు యిు
నిర్వహణల మీద నెలకొల్పిన ప్రాచీన ఇటలీ ఏకత్వం కూడా చాలా కాలం
మనలేదని మరచిపోకూడదు. సువిశాల భారత భూభాగాలలో, అంతకుముందే
ఆధ్యాత్మిక సాంస్కృతిక ప్రాతిపదిక ఏర్పడకుండా అటువంటి ప్రయత్నం
జరిగివుంటే అదీ మనగలిగేదికాదు. ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వానికి
అదేపనిగా మితిమీరిన ప్రాధాన్యత నిచ్చినట్లు, రాజకీయ బాహ్య సమైక్యత
పట్లగల పట్టుదల దుర్బలంగా ఉన్నట్లు నిర్ధారించినా, ఈ ప్రాధాన్యత
వినాశన హేతువని ప్రయోజన రహితమని చెప్పటానికి వీలులేదు. మొదటి
నుంచీ ఉన్న ఈ వైచిత్రి, చెరగని ఆధ్యాత్మికముద్రి, సమస్త భిన్నత్వంలో
అంతర్లీనంగా ఉన్న ఏకత్వం కారణంగా భారతదేశం ఇంకా ఏకైక వ్యవస్థీ
కృత రాజకీయ జాతి (Political Nation) కాకపోయినా ఇప్పటికీ అది
జీవించి ఉన్నది: ఇప్పటికి అది భారతదేశంగానే ఉన్నది.

ఎన్ని చెప్పినా శాశ్వతంగా నిలిచి ఉండేది ఆధ్యాత్మిక సాంస్కృ
తిక ఏకత్వం ఒక్కటే. పట్టు సడలని మనఃస్థితి చైతన్యాలవల్లనే జాతి
ఆత్మ జీవించి ఉంటుండిగాని, దీర్ఘ కాలం మనగల భౌతికవ్యవస్థలు, బాహ్య
వ్యవస్థలవల్ల కాదు. భౌతిక యదార్థాలకు మాత్రమే పరిమితమైన పాశ్చాత్య
మనఃస్థితి ఈ సత్యాన్ని గ్రహించటానికి అంగీకరించటానికి ఇష్టపడక
పోవచ్చు. కాని వీని నిరూపణలు యుగయుగాల చరిత్రపుటలలో స్పష్టంగా
లిఖించబడి ఉన్నాయి భారతదేశానికి సమకాలీనాలుగా ఉన్న ప్రాచీన
జాతులు, భారతదేశం తర్వాత పుట్టిన జాతులు రూపు మానిపోయి, వాటి
స్మృతిచిహ్నాలు మాత్రం ఈనాడు మిగిలి ఉన్నాయి. గ్రీసు, ఈజిప్టుదేశాలు

చిత్రపటాలలో నామమాత్రాలుగా ఉండిపోయాయి. ఏథెన్సులో గ్రీకు ఆత్మగాని, కెయిరోలో మెమ్ఫిస్‌ను నిర్మించిన గంభీర జాతి – ఆత్మగాని కన్పించవు మెడిటరేనియన్‌జాతులమీద రాజకీయ, కేవల బాహ్యసాంస్కృతిక ఏకత్వాన్ని బలవంతాన ఏర్పరచిన రోము వారి సజీవ ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వాన్ని మాత్రం సృష్టించలేక పోయింది. అందుచేతనే తూర్పు పశ్చిమంనుంచి విడిపోయింది. మధ్యంతరంగా వచ్చిన రోమన్ నాగరికతా చిహ్నాన్ని ఆఫ్రికా అట్టిపెట్టుకోలేదు. ఈనాటికీ "లాటిన్"జాతులుగా వ్యవహరించబడుతున్న పాశ్చాత్యదేశాలు అనాగరిక జాతుల దండయాత్రలను శక్తివంతంగా నిరోధించలేక విదేశీయ జీవశక్తి పోసిన ఊపిరితో, ఆధునిక ఇటలీ, స్పెయిన్, ఫ్రాన్సులుగా పునర్జన్మ పొందవలసివచ్చింది. భారతదేశం మాత్రం ఈ నాటికీ జీవించి ఉన్నది. యుగయుగాల భారతదేశంతో పాటుగా దాని ఆత్మ, అంతఃకరణ, చైతన్యం కొనసాగుతూనే ఉన్నాయి. గ్రీకు, పార్థియన్, హూణ దండయాత్రలు విదేశీపరిపాలనగాని, బలిష్ఠమైన ఇస్లామ్ జీవశక్తి గాని, సర్వాన్నీ నేలమట్టం చేసి అణచివేసే దుర్భర ఆంగ్లేయ ఆక్రమణ, ఆంగ్లవ్యవస్థగాని, పాశ్చాత్యదేశాల అంతులేనిఒత్తిడి గాని వైదిక ఋషులు నిర్మించి ఇచ్చిన తన శరీరంనుంచి సనాతనమైన ఆత్మను తరిమివేయలేకపోయాయి, ధ్వంసం చేయలేకపోయాయి; అడుగడుగునా, ప్రతి ప్రమాదాన్ని, దాడిని, ఆధిపత్యాన్ని ఎదిరించి ఈ దేశం జీవించగలిగింది. తాను ఘనంగా బ్రతికిన దినాలలో ఆధ్యాత్మిక సంఘటితత్వం, సంవిలీనప్రతిచర్యశక్తులు ఈవిధంగాచేయటంలో భారతదేశానికితోడ్పడ్డాయి. విలీనం చేసుకొనలేనిదానిని విసర్జిస్తూ, విసర్జించరానిదానిని విలీనం చేసుకొంటూ, క్షీణయుగ ప్రారంభ దశలోకూడ, తగ్గిపోయినా నశించిపోని

ఈ శక్తివల్లనే అది బ్రతుకగలిగింది. దక్షిణ భారత దేశంలోకి తిరోగమించి అక్కడనే తన ప్రాచీన వ్యవస్థను నిలబెట్టుకొని, ఇస్లాం ఒత్తిడి క్రింద రాజపుత్ర, సిక్కు, మరాటా రాజ్యాలను తన ప్రాచీన వ్యక్తిత్వాన్ని భావనను రక్షించుకోవటానికి ఆవిర్భవింపజేసింది శక్తివంతంగా ఎదిరించలేనప్పుడు సాత్వికంగా పట్టుదలను కొనసాగిస్తూ, తన చిక్కుప్రశ్నకు సమాధానం చెప్పలేని, తనతో రాజీకిరాలేని, ప్రతిసామ్రాజ్యాన్ని క్షీణతకు గురిచేస్తూ తన పునరుజ్జీవన సమయంకోసం నిరీక్షిస్తూ ఉండేది. ఈనాడు కూడ ఇటువంటి దృశ్యాన్ని మన కళ్ళ ముందు చూస్తూనే ఉన్నాము. ఇంతటి అద్భుతకృత్యాన్ని సాధించగలిగిన నాగరికత సర్వాతీత జీవశక్తిని గురించీ, బాహ్య విషయాలమీద గాక చైతన్య అంతఃకరణల మీద దాని పునాదులు నిర్మించి ఆధ్యాత్మిక సాంస్కృతిక ఏకత్వాన్ని క్షణభంగుర వృష్ఫంగాకాక, దాని అస్తిత్వ మూలంగా కాండంగా, నశించిపోయే పైకట్టడంగా కాక శాశ్వతమైన ప్రాతిపదికగా చేసిన మహామహుల వివేకాన్ని గురించీ ఏమనిచెప్పగలము?

కాని ఆధ్యాత్మిక ఏకత్వం చాలా విస్తారమైనది, మృదుశీలమైనది రాజకీయాలు బాహ్యవిషయాలలో లాగా దానికి కేంద్రీకరణను గురించి పట్టుదల లేదు; పై పెచ్చు వ్యవస్థలో సర్వత్రా వ్యాపించటం వల్లనే అది జీవిస్తుంది: గొప్పవైవిధ్యాన్ని జీవన స్వేచ్ఛను సత్వరమే అనుమతిస్తుంది. ప్రాచీన భారతదేశ ఏకీకరణ సమస్య ఎందుకు క్లిష్టమైనదో ఆ రహస్యాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాము. సేచ్ఛా వ్యవసాన్ని, స్థానిక స్వయంపాలక సంస్థల్ని, సుస్థిరసామాజిక స్వేచ్ఛలను అణగద్రొక్కే కేంద్రీకృత కరూప సామ్రాజ్య విధానాలు ఆ ఏకత్వాన్ని సాధించలేవు. ఈ విధా

నంలో అటువంటి ప్రయత్నం జరిగిన ప్రతిసారీ, విజయం లభించినట్లు చాలాకాలం కనిపించినా, అది విఫలం అయిపోతూనే ఉన్నది. తన అంతర్గత ఆత్మ చైతన్యం విధ్వంసం కాకుండా దాని ఆత్మ తాత్కాలిక భద్రత కోసం తన అగాధ జీవన మూలాధారాలను అమ్ముకోకుండా నివారించటం కోసమే భారతదేశ భవితవ్యాన్ని కాపాడుతున్న దేవతలు వివేక దృష్టితో అది విఫలమై పోక తప్పకుండా చేశారనికూడా అనుకోవచ్చు. భారతదేశ ప్రాచీన మనఃస్థితి తన అవశ్యకత ఏమిటో అంతర్బుద్ధితో గ్రహించింది. సామ్రాజ్యం అంటే, ప్రతి ప్రాంతీయ సామాజిక స్వేచ్ఛను గౌరవిస్తూ, సజీవ స్వయం పాలిత సంస్థ దేనినీ అణగద్రొక్కకుండా, జీవన సమన్వయాన్నే గాని యాంత్రిక ఏకత్వాన్ని ఏర్పరచకుండా ఉండే సమైక్య పరిపాలన అని దాని భావం. తరువాతి కాలంలో అటువంటి పరిష్కారం క్షేమంగా వృద్ధి చెందటానికి, దానికి కావలసిన వాస్తవ మార్గాలు, స్వరూపం, ఆధారం నిలదొక్కుకోటానికి అవసరమైన పరిస్థితులు అదృశ్యమై పోయి, దాని బదులు, ఒకే ఒక పరిపాలనా సామ్రాజ్యాన్ని స్థాపించే ప్రయత్నం జరిగింది. తక్షణ బాహ్య అవశ్యకత ఒత్తిడి మూలంగా నిర్దేశించబడిన ఈ ప్రయత్నం, ఎంతటి మహత్త్వవైభవోపేతంగా కనిపించినా, పరిపూర్ణ విజయాన్ని సాధించటంలో విఫలమై పోయింది. తన ఆత్మ చైతన్య సత్య లక్ష్యానికి అనుగుణమైనది కాకపోవటం వల్లనే భారతదేశం ఆ విధంగా చేయలేకపోయింది. భారత రాజకీయ-సాంఘిక వ్యవస్థలో అంతర్లీనంగా ఉన్న సూత్రం సామాజిక స్వయం పాలిత సంస్థల-స్వయం ప్రతిపత్తిగల గ్రామ, నగర రాజధానులు, జాతి (Caste) పారిశ్రామిక సంఘం (guild) కుటుంబం, కులం (Clan), మత సమాజం, ప్రాంతీయ సంస్థల-సమన్వయమని ఇది వరకు గమనించాము. స్వేచ్ఛాయుత సజీవ సావయవ వ్యవస్థలో స్వయం ప్రతిపత్తిగల సంస్థలన్నిటినీ పట్టి ఉంచి, సమన్వయ పరచటానికి రాజ్యవ్యవస్థ, రాజరికం, గణతంత్రికూటమి ఒకో

సాధనం. ఈ రాజ్య వ్యవస్థల, ప్రజా సముదాయాల, జాతుల (Nation) స్వయం ప్రతిపత్తిని గౌరవిస్తూనే, ఏకత్వాన్ని నెలకొల్పి ఇతోధిక విస్తృత స్వేచ్ఛా సజీవ నిర్మాణంగా, వాటన్నింటినీ సంయోజనం చేయటమే సామ్రాజ్య సమస్య. తన సభ్యులలో ఏకతను శాంతిని నెలకొల్పి, విదేశీ దాడుల నుంచి భద్రతను సమకూర్చి, తన ఏకత్వ నానాత్వాలలోను, తనలో విభాగాలుగా ఉన్న ప్రత్యేక సామాజిక సంస్థల నిర్బంధరహిత, క్రియాశీల జీవనంలోను, భారతీయ నాగరికతా సంస్కృతుల శరీరాత్మల స్వేచ్ఛా ప్రవర్తనను వికాసాన్ని, సముజ్జ్వల సంపూర్ణ ధర్మ పరిమాణాన్ని సర్వ సమగ్రం చేయగలిగిన ఒక వ్యవస్థను కనుగొనవలసి ఉన్నది.

ఈ సమస్యను తొలినాళ్ళ భారతీయమనఃస్థితి అవగాహన చేసుకొన్నది. ఈ అర్థంలో తరువాత వచ్చిన పరిపాలనా సామ్రాజ్యం దీనిని పాక్షికంగా ఆమోదించింది. దాని ధోరణి మాత్రం, కేంద్రీకరణ ప్రవృత్తి ఏ విధంగా వ్యవహరిస్తుందో ఆ విధంగా ఉండక తప్పక పోవటం వల్ల చాల నెమ్మదిగా తనకు తెలియకుండానే విధేయ స్వయం సత్తాక సంస్థలను కావాలని ధ్వంసం చేయక పోయినా, కృశించి బలహీన పడేటట్లు చేసింది. ఇందువల్ల సంభవించిన పరిణామం, కేంద్రాధికారం బలహీనపడి నప్పుడల్లా, భారత దేశ జీవనానికి అత్యావశ్యకమైన, అంతరించిపోకుండా నిలిచి ఉన్న, ప్రాంతీయ స్వయం ప్రతిపత్తి మాత్రం సామరస్యతీవ్రత కోసం, స్వేచ్ఛా యుతమై అప్పటికీ సమైక్యంగా వ్యవహరిస్తున్న సమగ్ర జీవిత కోసం పాటుపడకుండా, కృతకంగా స్థాపించబడిన ఏకత్వానికి భంగకరంగా విజృంభించటం, సామ్రాజ్య రాజరికం గూడా స్వేచ్ఛా ప్రజాసభల శక్తిని కృంగజేసే ప్రవృత్తిని కలిగి ఉండటంచేత, సామాజిక సంస్థలు సమైక్య బలాంశాలు కావటానికి బదులుగా, ఏకాకులై విభజనకర అంశాలుగా రూపొందటం, జరిగింది. గ్రామీణ సమాజం తన జీవశక్తిని కాపాడుకొన్నది

కానీ దానికి అత్యున్నతాధికార సంస్థతో సజీవసంబంధం లేకుండాపోయింది. విశాల జాతీయ భావాన్ని విడనాడటం వల్ల, తన స్వయం సమృద్ధ సంకుచిత జీవితాన్ని గౌరవించే స్వదేశీ విదేశీ పరిపాలనను దేనినైనా ఆమోదించటానికి అది సిద్ధపడింది మత సమూహాలలోను ఇదే భావన నిండిపోయింది. దేశంలోని ఆధ్యాత్మిక ఆర్థిక ఆవశ్యకతలతో వాస్తవ సంబంధం లేకుండా, నిజమైన అవసరం ఏదీ లేకుండా జాతుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది అవి అతిక్రమించరాని ఆచారవిభజనలుగా, ప్రారంభంలో ఉన్నట్లు సమగ్ర జీవనసమన్వయ సామరస్య వర్తనాంశాలుగా కాక, ఒంటరితనాన్ని కలిగించే శక్తిగా రూపొందాయి. చివరిఘట్టంలో, అంతిమ క్షీణ దశలో, ముఖ్యంగా మరాటా కూటమి చరిత్ర తరువాత దశలో మినహాయించి జాతి విభజనలు ప్రజాసమైక్య జీవనానికి అవరోధాలుగా ఉండేవనీ, ఆ తరువాత కూడ అవి రాజకీయ సంఘర్షణకు, అనైక్యతకు దోపతీసే క్రియాశక్తిగా వ్యవహరించాయని చెప్పటంలో నిజంలేదు. అయితే స్వేచ్ఛా క్రియాశీల సమైక్య జీవన పునర్నిర్మాణానికి అడ్డంకిగా, సబ్ధమైన ప్రత్యేకతా తత్వాన్ని, సంఘ విభజనను కలిగించే ఒక ఉదాసీన శక్తిగా రూపొందాయి.

మహమ్మదీయ దండయాత్రలకు పూర్వం ఈ జాతి వ్యవస్థలోని దురాచారాలు అంత శక్తివంతంగా అభివ్యక్తంకాలేదుకాని అవి వ్యవస్థలో మొదటినుండే ఉండిఉంటాయి: పఠాన్ మొగలు సామ్రాజ్యాలు సృష్టించిన పరిస్థితులలో అతివేగంగా పెరిగిపోయాయి. తరువాత యుగానికి చెందిన ఈ సామ్రాజ్య వ్యవస్థలు, ఎంత తేజస్సును శక్తిని కలిగి ఉన్నప్పటికీ, నిరంకుశ స్వభావంకలవి గనుక, తమకు ముందున్న వాటికన్న అధికంగా

కేంద్రీకరణ దుష్ఫలితాలను అనుభవించాయి. కృత్రిమ ఏకత్వాధిపత్యాన్ని వ్యతిరేకంగా భారత ప్రాంతీయ జీవనం విజృంభించే ప్రవృత్తి మూలంగా అవి నిరంతరం విచ్ఛిన్నమవుతూ వచ్చాయి; వాటికి ప్రజా జీవితంతో సజీవ, వాస్తవ స్వతంత్ర సంబంధాలు లేకపోవటంచేత, విదేశీ దురాక్రమణ పరుల నుంచి రక్షించుకోగల సర్వ సామాన్య దేశభక్తి భావాన్ని సృష్టించలేక పోయినాయి. చివరగా ప్రవేశించిన యాంత్రిక పాశ్చాత్య పరిపాలన, కొన ఊపిరితో ఉన్న సామాజిక ప్రాంతీయ స్వయం సత్తాక సంస్థలన్నింటినీ అణగద్రొక్కి, వాటి స్థానంలో నిర్జీవ యాంత్రిక ఏకత్వాన్ని ప్రతిష్ఠించింది. దీనికి ఎదురైన ప్రతిచర్యలో ప్రాచీన ప్రవృత్తులు—భారత ప్రజల ప్రాంతీయ జీవితాన్ని పునర్నిర్మించే ప్రవృత్తి, జాతి (Race) భాషా పర మైన నిజమైన ఉపవిభజనలు ఆధారంగా రాష్ట్రీయ స్వయం ప్రతిపత్తిపట్ల అపేక్ష, దేశ సహజజీవితానికి కావలసిన సంస్థగా గ్రామీణ సమాజాన్ని భారతీయ మనఃస్థితి వెనకకు పిలవటం; ఇంకా పూర్తిగా పునః ప్రభవించక పోయినా పరిణత మనస్సులలో అస్పష్టంగా ఉదయిస్తున్న భారతీయ జీవితానికి అనుగుణమైన సామాజిక ప్రాతిపదికను గురించిన ఆధ్యాత్మిక పునాదుల మీద భారతీయ సమాజాన్ని రాజకీయాలను పునః ప్రతిష్ఠించటాన్ని గురించిన సత్యభావన-మళ్లీ తలఎత్తటం కనిపిస్తూ ఉన్నది.

ఏకత్వ సాధనలో భారతదేశం పొందిన వైఫల్యాల వల్లనే దండ యాత్రలు, చివరకు విదేశీయుల అధీనంలో ఉండవలసిరావటం ఫలితాలుగా సంభవించాయి. ఈ వైఫల్యానికి, నిర్వహించవలసిన బృహత్కార్య పరిమాణం, వైచిత్ర్యం కారణాలు. ఎందుకంటే, కేంద్రీకృత సామ్రాజ్య సులభ పద్ధతి ఒక్కటే సాధ్యమైన ఉపాయంగా కనిపించటంవల్ల, మళ్ళీమళ్ళీ

దానినే స్థాపించే ప్రయత్నం జరగటం, చాలాకాలం పాక్షికవిజయాన్ని పొందినా కాలక్రమంలో సర్వదా అది విఫలం కావటమే జరిగింది. కనుక అది నిజమైన విజయాన్ని సాధించలేకపోయింది ఈ సమస్యలోని సార భూత లక్షణాన్ని భారతదేశం మెరుగుగా అర్థం చేసుకోగలిగిందని నేను సూచించాను. భారతీయ ద్వీపకల్పంలోని అనేక జాతుల (Races) ప్రజా సముదాయాల ఆధ్యాత్మిక సాంస్కృతిక సమైక్యతను సాధించటం, భారతీయ జీవనానికి ఆధ్యాత్మిక ఆధారాన్ని స్థాపించటం. వేదరుషులు, వారి తరువాత వచ్చినవారు తమ ముఖ్యమైనపనిగా పెట్టుకొన్నారు. అయినా రాజ కీయ సమైక్యత అవశ్యకత వారికి గోచరంకాకపోలేదు. ఆర్యుల కుల జీవి తం (Clan life) విభిన్న పరిమాణాలలో వైరాజ్య, సామ్రాజ్యాలుగా, కూటములుగా, అధిపత్యరాజ్యాలుగా సంఘటితం అయ్యే ప్రవృత్తిని వారు గమనించి, అమార్గాన్నే అనాంతం అనుసరించటం సరి అయిన మార్గమని గ్రహించటం వల్ల, సముద్రం నుంచి సముద్రం వరకు వ్యాపించిన అనేక రాజ్యాల, ప్రజల, స్వయం ప్రతిపత్తిని ధ్వంసం చేయకుండా సమైక్యతను సమకూర్చగల సామ్రాజ్య పరిపాలన- చక్రవర్తి ఆదర్శాన్ని రూపొందిం చారు. భారతదేశజీవితంలో తక్కినవాటినన్నింటి మాదిరిగానే ఈ ఆదర్శాన్ని గూడ ఆధ్యాత్మిక, మత పరమైన అనుమతితో వారు పటిష్ఠం చేశారు. దీనికి బాహ్య ప్రతీకగా అశ్వమేధ రాజసూయ యజ్ఞాలను విధించి, ఈ ఆదర్శాన్ని సఫలీకృతం చేయటానికి ప్రయత్నించటం శక్తివంతుడైన రాజు పాటించ వలసిన విధ్యుక్తమతధర్మం.

ఈ ఆదర్శ పరిపూర్ణవికాసం మహేతిహాసగ్రంథాలలో కనిపిస్తుంది. అటువంటి ధర్మరాజ్యం ఒకదానిని స్థాపించటానికి జరిగిన పౌరాణిక లేదా

చారిత్రిక ప్రయత్నాన్ని తెలిపే గ్రంథం మహాభారతం. అందులో ఈ ఆద ర్శం ఎంత అనుల్లంఘనీయంగా, సర్వజన సమ్మతంగా చిత్రించబడిం దంటే, అల్లరితనానికి మారుపేరైన శిశుపాలుడుకూడ విధేయుడై రాజసూ యంలో తాను పాల్గొనటానికి, యుధిష్ఠిరుడు నిర్వహిస్తున్నది ధర్మబద్ధమైన కార్యమనే ఉద్దేశం కారణమని ప్రతిపాదించటం జరిగింది. రామాయణంలో అటువంటి ధర్మరాజ్య ఆదర్శచిత్రం, ఒక సుస్థిర విశ్వజనీన రాజరిక వ్యవస్థ కనిపిస్తుంది. ఇక్కడకూడా అది హద్దులేని నిరంకుశ ప్రభుత్వంకాదు; పట్ట ణంలో రాష్ట్రాలలో ఉన్న స్వేచ్ఛాప్రజాసభలు, అన్ని వర్గాలు బలపరచిన విశ్వజనీన రాజరిక రాజ్యవ్యవస్థ (monarchical state) ను ఆదర్శంగా నిలబెట్టటం జరిగింది: సామాజిక స్వయంసత్తాక సంస్థలకు సమన్వయం చేస్తూ ధర్మసంవిధానాన్ని, న్యాయాన్ని నిర్వహిస్తూ ఉన్న రాజరిక వ్యవస్థ విశాలరూపమే ఇది. ఇక్కడ ప్రదర్శించిన విజయం అనే ఆదర్శం, సజీవ స్వేచ్ఛను, రాజకీయ సాంఘిక వ్యవస్థలను ధ్వంసం చేసి, ఓడిపోయినవారి ఆర్థిక వనరులను కొల్లగొట్టే వినాశనకర, హింసాత్మక దండయాత్ర కాదు; యజ్ఞసంబంధ పురోగతితోపాటు సైనికబల పరీక్ష జరిగేది. ఇందులో ఓడిపోవటంవల్ల, దృశ్యమాన జాతీయ ఏకత్వ, ధర్మసంస్థాపనతో మాత్రం నిమిత్తం కల ఆధిపత్యానికి పుష్టికరమైన అనుబంధంగా ఉండటమే తప్ప, అవమానంగాని, బానిసతనంగాని, బాధగాని సంభవించకపోవటంతో ఈ పరీ క్షాఫలితాన్ని చాలాసునాయాసంగా అంగీకరించేవారు. ప్రాచీనరుషుల ఆద ర్శం యుద్ధమగ్న, విభక్త ప్రజాసంఘాలను సంఘటితపరచవలసిన ఆవశ్యకత, రాజకీయ ప్రయోజనంసుస్పష్టమే కాని సామాజికసంస్థల స్వేచ్ఛ లను, ప్రాంతీయ ప్రజాసముదాయాల స్వేచ్ఛాజీవితాన్ని హరించకుండా,

అంటే ఒక కేంద్రీకృత రాజరికవ్యవస్థ ద్వారా,లేక ఏకత్వాన్ని కఠోరంగా విధించే సామ్రాజ్య వ్యవస్థద్వారా కాకుండా, ఇది సమకూడేట్లు వారు చూచారు. వారు ప్రజల మనస్సులమీద ముద్రించ దలచిన భావరూపానికి అత్యంత సమీపమైన పాశ్చాత్య సాదృశ్యం, ఒక సామ్రాజ్యాధినేత ఆధ్వర్యంలో ఆధిపత్యం లేదా రాజ్యకూటమి.

యుధిష్ఠిరునికి పూర్వం ఉన్న అటువంటి సామ్రాజ్యాలను గురించి ఇతిహాస సాంప్రదాయం ప్రస్తావించినప్పటికీ, ఈ ఆదర్శం అమలు జరిగిన చారిత్రక సాక్ష్యాధారం లేదు. బుద్ధునికాలంలో, ఆ తరువాత చంద్రగుప్త చాణక్యులు, మొట్టమొదటి చారిత్రక భారతీయ సామ్రాజ్యాన్ని నిర్మిస్తున్న కాలంలో, ఇంకా దేశం అంతటా స్వేచ్ఛారాజ్యాలు, గణతంత్ర వ్యవస్థలు వ్యాపించి ఉండేవి. కాని అలెగ్జాండరు దండయాత్రను ఎదుర్కొనగలిగిన సమైక్య సామ్రాజ్యం లేదు. ఒకవేళ అంతకుముందు ఆధిపత్య వ్యవస్థ (hage mondy) ఉండి ఉంటే, తాను శాశ్వతంగా కొనసాగే పధానాలను వ్యవస్థను కనుగొనటంలో అది విఫలమైపోయిందని స్పష్టపడుతుంది. సమయం లభిస్తే ఆ విధంగా జరిగేదికాని ఇంతలోనే ప్రమాదకరమైన మార్పు రావటంతో తక్షణ పరిష్కారాన్ని కనుగొనటం అత్యావశ్యకంగా పరిణమించింది. వాయవ్య కనుమలద్వారా ప్రమాదం కలిగే అవకాశం ఉండటం చారిత్రాత్మకమైన భారతద్వీపకల్పం బలహీనత. ఇండస్‌నది అవతల చాల దూరం ప్రాచీన భారతదేశం వ్యాపించి ఉన్నప్పుడు ఈ బలహీనతకు ఆస్కారం ఉండేదికాదు శక్తివంతమైన గాంధార, బాహ్లిక రాజ్యాలు విదేశీదండయాత్రల నుంచి కాపాడే కోటలుగా ఉండేవి. సువ్యవస్థితమైన పర్షియా రాజ్యం ధాటికి అవి కూలిపోవటం మూలంగా అప్పటినుంచి ఇండస్‌నది

అసలి దేశాలు భారతభూభాగాలు కాకుండాపోయి, భారతదేశానికి రక్షణను కూడా ఇవ్వలేకపోగా దండయాత్ర జరిపేవారికి భద్రమైన స్థావరంగా మారిపోయాయి. ఈ ప్రమాదం ఎంతటిదో అలెగ్జాండరు దండయాత్ర స్పష్టం చేసింది. అనాటినుంచి కవులు, రచయితలు, రాజకీయ తత్త్వవేత్తలు, నిరంతరం సామ్రాజ్యాదర్శాన్ని బలపరచి, దానిని సాధించగల మార్గాలను గురించి ఆలోచించినట్లు కనపడుతుంది. చాణక్యుని రాజనీతిజ్ఞత శర వేగంతో స్థాపించి, బలహీనత, విచ్ఛిన్నతా ప్రారంభ దశలు ప్రాప్తించినా కూడ, క్రమంగా మౌర్య, శుంగ, కణ్వ, ఆంధ్ర, గుప్త వంశాలు నిలబెట్టి లేదా పునః స్థాపించిన సామ్రాజ్య అవతరణ, దీనివల్ల ఆచరణలో కలిగిన తక్షణ పరిణామం, ఈ సామ్రాజ్య చరిత్ర, గ్రామసీయమైనదాని వ్యవస్థ, పరిపాలన, ప్రజాహితకార్యాలు, సమృద్ధి, మహోన్నత సంస్కృతి, జీవశక్తి ఉజ్జ్వలదీప్తి, దాని నీడ క్రింద ద్వీపకల్పంలో వెల్లి విరిసిన వైభవోపేత ఫలప్రద జీవితం, మనకులభిస్తున్న చెల్లాచెదరై చాలీ చాలని లిఖితాధారాల వల్ల మాత్రమే బయటపడుతున్నప్పటికీ. భూమండలంలోని ప్రజా సముదాయాల అసాధారణ ప్రజ్ఞ నిర్మించి నిర్వహించిన అత్యుత్తమ సామ్రాజ్యాల శ్రేణికి చెందిఉన్నది. ఈ దృక్పథం నుంచి భారత దేశం సామ్రాజ్య నిర్మాణంలో ప్రాచీన కాలంలో తాను సాధించిన మహా కార్యాన్ని గురించి గర్వపడకపోవటానికి గాని, తన ప్రాచీన నాగరికతను పట్టి కార్యాచరణ ప్రజ్ఞను, ఉన్నత రాజకీయ నీతి వైశిష్ట్యాన్ని నిరాకరించే కొందరపాటు తీర్పును తలపెట్టటానికి గాని కారణంలేదు.

అదే సమయంలో, ప్రథమనిర్మాణంలో దొర్లిన అనివార్యమైన కొందరపాటు, హింస, కృతకత్వాలవల్ల, ఈ సామ్రాజ్యం అత్యావశ్యకతను

ఎదుర్కొనటంలో చాలా బాధ పడవలసివచ్చింది. కారణం, తన గంభీర అదర్శసత్యం ప్రాచీన భారతీయ సంఘటిత విధానంలో బుద్ధిపూర్వక సమాజ దృఢ వికసనం పొందకుండా అది నివారించింది. కేంద్రీకృత సామ్రాజ్య రాజరిక వ్యవస్థను స్థాపించే ప్రయత్నం స్వేచ్ఛాయుత సమన్వయానికి బదులు ప్రాంతీయ స్వయం పాలిత సంస్థల విచ్ఛిత్తిని వెంటబెట్టుకొని రావటం ఇందుకుకారణం. భారతీయ సిద్ధాంతాన్ననుసరించి ప్రాంతీయ స్వయంపాలిత సంస్థలను, వాటి ఆచారాలను గౌరవించి, ప్రారంభంలో వాటి రాజకీయ సంస్థలను, కనీసం చాలాసందర్భాలలో, పూర్తిగా రద్దు చేయకుండా సామ్రాజ్య వ్యవస్థ లోపలికి తీసుకొని వచ్చినప్పటికీ, సామ్రాజ్య కేంద్రీకరణ ఛాయలో అవి నిజమైన వృద్ధిని సాధించలేదు. ప్రాచీన భారత ప్రపంచంలోని స్వేచ్ఛా ప్రజా సంఘాలు అంతరించి, వాటి భిన్నద్రవ్యాలు, తరువాతికాలంలో, ఈ నాటి జాతులను సృష్టించటానికి పనికి వచ్చాయి. చాలకాలం వరకు మహా ప్రజాసభలు శక్తిసామర్థ్యాలతో కొనసాగినప్పటికీ, చివరకు అవి మరింత యాంత్రికంగా రూపొంది, వాటి జీవశక్తి క్షీణించి బాధకుగురి అయిందని మొత్తంమీద నిర్ణయించవలసి వస్తుందని అనుకొంటున్నాను. వ్యవస్థీకృత రాజ్యానికో సామ్రాజ్యానికో నగరగణతంత్ర సంస్థలుకూడ పురపాలక సంఘాలుగా తయారయినాయి. సామ్రాజ్య కేంద్రీకరణ సృష్టించిన మనఃస్థితివల్లా, మరింత యోగ్యతగల ప్రాచీన స్వతంత్ర ప్రజా సంస్థలు బలహీనపడటమో అంతరించిపోవటమో జరగటంవల్లా, ఒక విధమైన సందు ఏర్పడింది. దీనికి ఒక వైపున వారికి భద్రతచేకూర్చి, వారి మత, జీవన, ఆచారాలలో మితిమీరిన జోక్యం లేని ప్రభుత్వం పరిపాలనా విషయం; మరొక వైపున నిస్సందేహంగా లాభదాయ

క్రమము, వైభవోపేతము అయినా తొలినాటి యదార్థ భారతరాజకీయ మనః స్థితి ఆశించిన విధానంలో సజీవస్వతంత్ర ప్రజలకు సజీవనాయకత్వం వహించ లేని సామ్రాజ్య పరిపాలనా వ్యవస్థ ఉన్నాయి. ఈ ఫలితాలు ప్రబలిస్తే, క్షీణదశలో మాత్రమే అంతిమఘట్టం చేరుకొన్నాయి, కాని అవి అక్కడ బీజరూపంలో ఉండి యాంత్రిక ఏకీకరణ పద్ధతిని అవలంబించిన తర్వాత అవి అనివార్యం అయినాయి. దీనివల్ల దృఢతరము, అధిక సుసంగతము అయిన సైనిక చర్య, మరింత క్రమబద్ధ ఏకరూప పరిపాలన సమకూడి నాయిగాని ప్రజల మనోస్వభావాలకు నిజమైన ప్రకటనగా ఉండే స్వేచ్ఛా యుత సజీవ నానాత్వసహిత జీవనానికి కలిగిన హాని వీటి వల్ల పరిహారం కాలేదు.

ధర్మ ఉన్నతాదర్శం నుంచి పతనం కావటమే దీనివల్ల సమకూడిన దుష్ఫలితం. ఆధిక్యత కోసం రాజ్యాలు పరస్పరం తలపడటంతో, ప్రాచీన ఉన్నత నైతికాదర్శాల స్థానంలో కుటిల రాజ్యతంత్రం ప్రవేశించింది; గాఢ దురాక్రమణ వాంఛ మీద ఆధ్యాత్మిక నైతికనియంత్రణ తగినమేరకు లేక పోయింది. నెత్తురు చిందించిన అశోకుని ఒరిస్సా విజయం, మౌర్యులనాటి క్రూర దండనీతి, రాజకీయ ప్రభుత్వనీతిలో జాతీయ మనః స్థితి మొరటు బారిపోవటాన్ని తెలియజేశాయి. మత చైతన్యం, ఉన్నత ప్రజ్ఞ ఈ క్షీణ తను తాత్కాలికంగా అరికట్టటంవల్ల తరువాత వేయి సంవత్సరాలకుగాని అది పతాక స్థాయిని చేరలేదు క్షీణత ప్రతిఫలించి పోయినదశలో ఇది పూర్తిశక్తితో కనిపిస్తుంది. అప్పటి హద్దు అదుపులేని పరస్పరదురాక్రమ ణలు, రాజుల నాయకుల విశృంఖల దురహంకారం, రాజకీయ నియమం సార్థక సమైక్యత అంతర్ధానం కావటం, సామాన్య దేశభక్తి భావం

అంతరించటం, పరిపాలకుల మార్పుపట్ల సామాన్య ప్రజలకు గల సాంప్ర దాయిక ఉదాసీనత-అన్నీ కలిసి ఈ సమస్త సువిశాల భారతద్వీపకల్పాన్ని విదేశాలనుంచి వచ్చిన కొద్దిమందివ్యాపారుల చేతుల్లో పెట్టాయి. ఈ దుష్ప లితాలు ఎంత నెమ్మదిగా వచ్చినా, మొదట్లో వీటిని సామ్రాజ్య రాజకీయ మహత్త్వం, సముజ్జ్వల వైజ్ఞానిక కళాసంస్కృతి, తరచుగా సంభవించిన ఆధ్యాత్మిక పునరుజ్జీవనాలు, ఎంతగా రక్షించి అదుపులో ఉంచినా, గుప్త రాజులకాలం వచ్చేనాటికే భారతదేశం తన ప్రజల రాజకీయ జీవన అంత శ్చైతన్యం, తన వాస్తవ మనఃస్థితి, సహజ పరిపూర్ణ వికాసంపొందే అవకా శాన్ని కోల్పోయింది. సుస్థిర సంస్కృతులన్నింటికీ ఉపద్రవంగా పరిణ మించి, అత్యున్నతంగా అభివృద్ధిచెందిన గ్రీకు రోమన్ నాగరికతలకుగాని సువిశాల శక్తి యుక్త రోమన్ సామ్రాజ్యానికి గాని లొంగని అంతులేని ఆటవిక జాతుల కల్లోల ప్రవాహాన్నుంచి, భారత భూభాగాన్ని భారతనాగరి కతను రక్షించే లక్ష్యంతో ఆవిర్భవించిన ఈ సామ్రాజ్యం, సంపూర్ణంగా కాకపోయినా, చాలాచక్కగా ఈ లక్ష్యాన్ని నెరవేర్చింది. ఈ కల్లోలం, ట్యూటాన్స్, హూణ, సిథియన్ జనసమూహాలు పశ్చిమ, తూర్పు దిశలకు వ్యాపించేటట్లు చేసింది భారతదేశ ద్వారాల దగ్గర చాలా శతాబ్దాలు అవి చావు దెబ్బలు తిని, కొంతవరకు లోపలికి చొచ్చుకొనివచ్చాయి. పతనమై పోయిన తర్వాత భారతనాగరికతా మహాసౌధం చెక్కుచెదరకుండా, సుస్థి రంగా, మహత్త్వపూర్ణంగా, భద్రంగా నిలిచి ఉన్నది. సామ్రాజ్యం బలహీన పడినప్పుడు ఈ దండయాత్రలు జరిగాయి: కొంతకాలం దేశంలో భద్రత నెలకొని ఉన్నప్పుడు ఈ బలహీనత సంభవించింది. ఏ ఆవశ్యకత కోసం ఈ సామ్రాజ్యం సృష్టి అయిందో దాన్ని తాత్కాలికంగా అది తీర్చింది

వల్లనే అది బలహీనపడింది. ఎందుకంటే, ఆ సమయంలో ప్రాంతీయభావం. వేర్పాటు ఉద్యమాలలో తిరిగి మేలుకొని, దాని సమైక్యతను విచ్ఛిన్నంచేసి. ఉత్తర భారతదేశం అంతటా దాని అపార విస్తృతిని భగ్నంచేసింది. సరి కొత్త ప్రమాదం ముంచుకు వచ్చినప్పుడల్లా, ఒక కొత్త రాజవంశ పరిపాలన కింద, అది మళ్ళీ చిగురించేది. చాలకాలం ఈ ప్రమాదం తలఎత్తక పోవటంతో దానిని ఎదిరించటానికే అవతరించిన సామ్రాజ్యం కూడ తిరిగి రాకుండా అంతరించిపోయేవరకు ఇది కొనసాగింది. అంతరించిపోతూ, ఈ సామ్రాజ్యం, తూర్పు దక్షిణ మధ్య భాగాలలో అధిక సంఖ్యలో గొప్ప రాజ్యాలను, వాయవ్యంలో మాత్రం మరింత గందరగోళ పరిస్థితిలో పడి ఉన్న ప్రజానీకాన్ని విడిచి పెట్టి వెళ్ళింది. బలహీన వాయవ్య ప్రాంతల నుంచే ముసల్మానులు చొరబడి, ఉనతికాలంలోనే, ఉత్తర దేశంలోని ప్రాచీన సామ్రాజ్యాన్ని ఒక సెంట్రల్ ఆసియా మాదిరిలో వేరైన పద్ధతిలో పునర్నిర్మించారు.

తొలినాళ్ళ ఈ విదేశీ దండయాత్రను, వాటి వల్ల సంభవించిన ఫలితాలను వాటి యదార్థ ప్రమాణంలో పరిశీలించాలి. ప్రాచ్య పండితులు గోరంతలు కొండంతలుగా చేసి చెప్పే సిద్ధాంతాలు తరచు వీటిని చెదర గొడుతున్నాయి. పశ్చిమ, మధ్య ఆసియాలో నిర్వహించవలసిన కర్తవ్యం ఉన్నా, భారతదేశంలో భవిష్యత్తు లేని హెల్లెనిజం తూర్పువైపు చొచ్చుకొని రావటం కలిగించిన ఫలితమే అలగ్జాండరు దండయాత్ర. అందుచేతనే చంద్రగుప్తుడు బయటకు త్రోసివేసిన తరువాత దాని గుర్తులుకూడ మిగలలేదు. బలహీనపడిన తరువాతి మౌర్యులకాలంలో ప్రవేశించి, సామ్రాజ్య పునరుద్ధరణ శక్తి రద్దుపరచిన గ్రీకు బాక్ట్రియన్‌లు భారతీయ సంస్కృతి గాఢ

ప్రభావానికి అప్పటికే లోనైన గ్రీకు జాతీయులే. ఆ పిమ్మట పార్థియన్, హూణ, సిథియన్ దండయాత్రలు మరింత ప్రమాదకరమైన స్వభావాన్ని కలిగి భారతదేశ సమగ్రతకు ముప్పుగా కనిపించాయి. వాటి తరంగాలు పంజాబు దాటి పశ్చిమ తీరం వెంట సుదూర దక్షిణ ప్రాంతాలకు వ్యాపించినప్పటికీ, దక్షిణంలోని దూర ప్రాంతాలలో, కొంతకాలంపాటు, పర జాతీయ రాజవంశ పరిపాలన స్థాపించటం జరిగినప్పటికీ, చివరకు మాత్రం ప్రబలంగా వాటి ప్రభావానికి లోనైంది పంజాబు మాత్రమే. ఈ భూభాగాలలోని జాతుల లక్షణాలను అవి ఎంతవరకు ప్రభావితంచేశాయో నిశ్చయంగా తెలియదు. ప్రాచ్యపండితులు, మానవజాతి శాస్త్రవేత్తలు (Ethnologiss) పంజాబు సిథియనీకరణం అయిందని, రాజపుత్రుల మూలవంశం అదే నని, దూర దక్షిణ ప్రాంతంలో కూడ వీరు చేరబడ్డందువల్ల జాతి మార్పు సంభవించిందని ఊహించారు. ఈ వాదాలకు ఉన్న సాక్ష్యాధారం దాదాపు శూన్యం లేదా అతిస్వల్పం: అంతేగాదు ఇతర సిద్ధాంతాలు ఈ వాదాలకు విరుద్ధంగా ఉన్నాయి. అంత గణనీయ పరిణామాన్ని కలిగించేటంత గొప్ప సంఖ్యలో ఈ ఆటవిక దురాక్రమణపరులు వచ్చి ఉంటారు అనేది సందేహాస్పదం. అదీగాక, రెండు మూడు తరాలలోనే ఈ దురాక్రమణపరులు పూర్తిగా భారతీయులైపోయి, భారతీయమతాన్ని, పద్ధతులను, ఆచారాలను, సంస్కృతిని సంపూర్ణంగా అవలంబించి అశేషభారత ప్రజానీకంలో కలిసిపోయినందుచేత అది మరింత అసంభవంగా కనిపిస్తుంది రోమనుసామ్రాజ్యంలోని దేశాలలో జరిగినట్లు, ఉన్నత నాగరికత మీద ఆటవికులు తమ చట్టాలను, రాజకీయ వ్యవస్థను, ఆటవిక ఆచారాలను' పదేశ పాలనను బలాత్కారంగా విధించటం భారతదేశంలో జరగలేదు. ఇది

దండయాత్ర లన్నింటికి ప్రముఖమైన సామాన్య యదార్థం ! దీనికి ముందు చెప్పబోయే అంశాలు మూడుగాని, అందులో ఏ ఒకటిగాని కారణం అయి ఉండవచ్చు. దురాక్రమణ జరిపింది సైన్యాలేగాని ప్రజలు కాకపోవచ్చు ; ప్రతి ఆక్రమణ తర్వాత భారతసామ్రాజ్యం తిరిగి తన బలాన్ని సంపాదించు కొని కోల్పోయిన రాజ్యాలను తిరిగి స్వాధీనపరచుకోగలిగినందువల్ల, తన విదేశీ లక్షణం గట్టిపడే సమయం లభించక, ఈ ఆక్రమణ ఒక నిరంతర బాహ్యపరిపాలన కాలేదు. దృఢశక్తి, విలీనం చేసుకొనే స్వభావం కలిగిన భారతీయ సంస్కృతి పటిష్టత, ఆక్రమణపరులలో విలీనీకరణాన్ని మాన సికంగా ఎదిరించే శక్తి లేకుండా చేసింది. ఒకవేళ ఈ దురాక్రమణల స్వభావం అత్యంత గణనీయమైనదని అనుకొన్నా, ట్యూటాన్, అరబ్బు చేతిలో భంగపడి, ఆటవిక, విచ్ఛిన్నస్థితిలో గుర్తుపట్టటానికి వీలులేక, నీచ స్థితికి దిగజారిన, తనకంటె చిన్నదైన గ్రీక్‌రోమన్ నాగరికతతో పోల్చి చూస్తే భారతనాగరికత ఎంతో దృఢమైనదిగా, శక్తివంతమైనదిగా, సంఘ టితమైనదిగా ఋజువుచేసుకొన్నట్లు పరిగణించితీరవలసిందే పశ్చిమభాగంలో ఛిద్రం ఏర్పడినా, ద్వీపకల్పంలోని మహాజన సందోహానికి భద్రతను చేకూర్చటంలో విజయం సాధించిన భారతదేశం, తన సంఘటితత్వాన్ని గురించి, ఘనతను గురించి గొప్పలు చెప్పుకొనే రోముసామ్రాజ్యం కన్న ఎన్నోరెట్లు సమర్థత కలిగినదిగా ఋజువు చేసుకొన్నదని కూడా తీర్మా నించక తప్పదు.

ముసల్మాను దండయాత్రలు అరబ్బుల చేతిలో విఫలమై, చాలా కాలం తర్వాత జరిగిన పునఃప్రయత్నం జయప్రదం అయిన, తరువాతి పతనదశ, దానిని అనుసరించి వచ్చినదంతా, భారతప్రజల సామర్థ్యాన్ని

గురించిన సందేహాల్ని సమర్థించటానికి ఉపకరిస్తుంది. కాని అసలు సమస్యను మాటుపరచే దురభిప్రాయాలను ప్రక్కకు త్రోసివేయాలి. రెండువేల సంవత్సరాల కార్యశీలత, కాల్పనికసృష్టి తర్వాత ప్రాచీన భారతీయ జీవిత సంస్కృతుల జీవశక్తి ఉడిగిపోయిన లేదా దాదాపు ఉడిగిపోయి సంస్కృతం నుంచి వాడుక భాషలలోకి కొత్తగా రూపొందుతున్న ప్రాంతీయ ప్రజా సంఘాలకు తరలిపోవటం ద్వారా శక్తిని తిరిగి సంపాదించుకొనటానికి గాను విరామసమయం అవశ్యకమైన తరుణంలో, ఈ దండయాత్ర జరిగింది. ఈ దండయాత్ర ఉత్తర భారతదేశంలో చాలా శతాబ్దాలు చాలా వేగంగా జరిగింది. కాని దక్షిణభారతదేశం స్వదేశ సామ్రాజ్యాన్ని ఎదిరించినట్లే దీనినీ ఎదిరించి తన పూర్వ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొన్నది విజయనగరరాజ్య అస్తమయానికీ, మరాఠారాజ్య ఆవిర్భావానికి, అంత ఎక్కువ అంతరం లేదు. అక్బరు, ఆతని వారసుల కాలందాకా రాజపుత్రులు తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొన్నారు. రాజపుత్ర రాజులు సేనాధిపతులుగా, మంత్రులుగా సహాయపడటం కొంతవరకు కారణం కాగా, చిట్టచివరకు మొగలాయీలు తూర్పు దక్షిణ ప్రాంతాలమీద సంపూర్ణ ఆధిపత్యాన్ని స్థాపించారు ఇలా జరగటానికి కారణం మళ్ళీ - ఈ వాస్తవాన్ని తరచుగా మరచిపోతూ ఉంటారు - చాలా త్వరగా ముసల్మానుల ఆధిపత్యం విదేశీ పరిపాలన కాకపోవటం. ముసల్మాను ప్రజానీకం అప్పటికీ ఇప్పటికీ జాతిరీత్యా భారతీయులే. పఠాన్, టర్కిష్, మొగలాయీ రక్తమిశ్రణం చాలా కొద్ది మోతాదులోనే జరిగింది విదేశీరాజులు, ప్రభువంశీయులు తమ మనఃస్థితిలో, జీవితంలో, స్వప్రయోజనాభిలాషలో, దాదాపు వెనువెంటనే పూర్తిగా భారతీయులైపోయినారు. కొన్ని యూరోపియన్ దేశాలలాగా జాతి

యావత్తు, శతాబ్దాల తరబడి విదేశీ ఆధిపత్యంక్రింద ఒడిపోయంగా, సమ్మతితో శక్తిహీనంగా పడి ఉంటే జన్మసిద్ధమైన మహాబలహీనతకు అది నిరూపణ అయి ఉండేవి. భారతదేశంమీద ఆధిపత్యం కొనసాగించిన నిజమైన పరదేశ పాలన బ్రిటిషువారిది మాత్రమే.

మధ్య ఆసియా మత సంస్కృతులతో కలిసి పోవటం చేతగాక, దాని దుర్భర భారంక్రింద ప్రాచీన నాగరికతకు గ్రహణం క్షీణ దశ ప్రాప్తించినా, ఆ ఒత్తిడికి తట్టుకొని జీవించటమేగాక అనేక విధాలుగా తన ప్రభావాన్నే దాని మీద ప్రసరించింది చరిత్రలో ఎంతో అరుదైన బలాన్ని, దార్ఢ్యాన్ని కలిగి ఉన్నట్లు రుజువుచేస్తూ క్షీణదశలోకూడ ఈనాటి వరకు ఆవిధంగా బ్రతికిఉండటమేగాక పునరుజ్జీవనం పొందగలిగిన శక్తిని గూడ అది కలిగి ఉన్నది. ఇక రాజకీయ క్షేత్రంలో మహారాజులను, రాజనీతిజ్ఞులను వీరసైనికులను, పాలకులను సృష్టించటం అది ఎన్నడూ మానలేదు. క్షీణదశలో దాని రాజకీయ ప్రతిభ సరిపడినంతలేదు; పఠాన్, మొగల్, యూరోపియన్‌లను తట్టుకొనగలిగినంతగా పొందిక, దృష్టిలో క్రియలో వేగము దానికి లోపించాయి కాని, బ్రతికిఉండటానికి పునరుజ్జీవనం కోసం వేచి ఉండటానికి కావలసిన పటిష్ఠత కలిగి, రాణాసంగుక్రింద సామ్రాజ్యాన్ని స్థాపించటానికి కృషిచేసింది; విజయనగర సామ్రాజ్యాన్ని సృష్టించింది: శతాబ్దాలకాలం రాజపుటానా పర్వతాలలో ఇస్లాముకు వ్యతిరేకంగా నిలవగలిగింది; తన చెడ్డ దినాలలోకూడ అత్యంతశక్తివంతులైన మొగలాయీలకు వ్యతిరేకంగా శివాజీ రాజ్యాన్ని నెలకొల్పింది: మహారాష్ట్ర రాజ్యకూటమిని, సిక్కుఖల్సాను ఏర్పరచింది: మొగలు మహారాజ్యాన్ని పాడు చేసింది. సామ్రాజ్య స్థాపనకొరకు మళ్ళీ ఆఖరి ప్రయత్నం చేసింది. మాటలతో చెప్పరాని అంధకారం, అనైక్యత గందరగోళం మధ్య, దాదాపు ప్రాణాంతకి పతనం కడఅంచున ఉండికూడ ఇంకా రంజిత్ సింగ్, నానా ఫడ్నవీసు, మధోజీ సింధియాలను సృష్టించి, అనివార్యమైన ఆంగ్లేయ

భవితవ్యగమనాన్ని ఎదిరించగలిగింది. అయితే ప్రధానమైన సమస్యను గుర్తించి పరిష్కరించటంలో విధివేసే నిరంతర ప్రశ్నకు జవాబు చెప్ప టంలో అసమర్థత పాలైందనే ఆరోపణ బలాన్ని ఈ వాస్తవాలు తగ్గించలేవు కాని, క్షీణ దశలో కనిపించే దృశ్యాలుగా వీటిని పరిగణించినప్పుడు, వాటి చరిత్ర చాల గణనీయంగా కన్పిస్తుంది. అదే పరిస్థితులలో వాటికి సాటి వచ్చే మరొక ఉదాహరణ లేనేలేదు. భారతదేశం ఎప్పుడూ పదేయమై, రాజ కీయంగా సమర్థత లోపించినదై ఉన్నదనే మోటుమాటకన్న ఇవి మొత్తం సమస్యకు ఒక భిన్న వైఖరిని ఆపాదించాయి.

ముసల్మాను దండయాత్రలు ప్రవేశ పెట్టిన అసలు సమస్య పరదేశీ దాస్యం స్వాతంత్ర్యపునరుజ్జీవనాలకు సంబంధించింది కాదు; రెండు నాగరి కతల సంఘర్షణకు సంబంధించినది-ఒకటి ప్రాచీనం, స్వదేశీయం. మరొకటి మధ్యయుగానికి చెందింది, బయటనుంచి వచ్చింది. ఇందులో ప్రతిదీ ఒక శక్తివంతమైన మతానికి అంటిపెట్టుకొని ఉండటంవల్ల ఈ సమస్య అపరిష్కృతంగా ఉండిపోయింది. ఒకటి ఉగ్రవాద దురా క్రమణలతో కూడినది: మరొకటి ఆధ్యాత్మిక సహనం వృత్తిశీలం కలిగి, స్వీయ సిద్ధాంతం పట్ల క్రమశిక్షణలో, పట్టు విడవని విశ్వాసంతో సాంఘిక రూపాల కోటగోడల వెనుక ఆత్మరక్షణార్థం నిలిచి ఉన్నది. ఈ సమస్యకు రెండు పరిష్కారాలు సాధ్యం కావచ్చు: ఈ రెండు నాగరికతలకు పొత్తు కుదర్చగలిగిన ఒకానొక ఆధ్యాత్మిక సూత్రం, రూపకల్పన ఆవిర్భవించటం లేదా మత సంఘర్షణను అధిగమించి రెండు సమాజాలను ఏకంచేయగల రాజకీయ దేశభక్తి భావం నెలకొనటం. ఆయుగంలో మొదటిది అసాధ్యం. ముసల్మానుల పక్షాన అక్బరు దీనికోసం ప్రయత్నించాడు కాని అతని మతం ఆధ్యాత్మిక సృష్టికావటానికి బదులు వైజ్ఞానిక రాజకీయ సృష్టి అయి నందువల్ల రెండు సమాజాలవారి గాఢ మత మనః స్థితులను సమ్మతిని పొందే అవకాశం దానికి లభించలేదు. హిందువుల పక్షాన నానక్ ఆ ప్రయ

త్నించేశాడు కాని ఆయనమతం, సూత్రప్రాయంగా విశ్వజనీనం అయినా ఆచరణలో ఒక ప్రత్యేక మత శాఖగా పరిణమించింది. అక్బరు ఒక సర్వసామాన్య రాజకీయ దేశభక్తి భావాన్ని సృష్టించాలనికూడ ప్రయత్నించాడు కానీ అదీ నిష్ఫలం కాకతప్పలేదు. మధ్య ఆసియాసూత్రం మీద నిర్మించిన నిరంకుశ సామ్రాజ్యం రెండుసమాజాలలోని మహాపురుషులు రాజులు, రాజవంశీయుల ద్వారా పరిపాలనా సామర్థ్యాన్ని ఆహ్వానించి అభిలషణీయ చైతన్యాన్ని సృష్టించలేదు. దీనికి కావలసినది ప్రజల సజీవ అంగీకారం: రాజక్రియాదర్శాలు, వ్యవస్థలు జాగృతం కాకపోవటం వల్ల ఇది కేవలం జడప్రాయంగా ఉండిపోయింది. మొగలు సామ్రాజ్యం ఒక మహా వైభవోపేత నిర్మాణం: దానిని సృష్టించటంలో అపార రాజకీయ ప్రజ్ఞ, కౌశలం, ప్రయోగించబడ్డాయి ఔరంగజేబు మతోన్మాద పూరితమైన పట్టుదల ఉన్నా, మొగలు సామ్రాజ్యం వైభవోపేతంగా, శక్తివంతంగా ప్రయోజన కారిగా ఉండటమేగాక మధ్యయుగానికి చెందిన లేదా సమకాలీన యూరపు రాజ్యసామ్రాజ్యాలు దేనికన్న అపార అధిక స్వేచ్ఛా మతసహనాలతో కూడి ఉండేవి. దాని పరిపాలనలో భారతదేశం సైనిక రాజకీయ బలంలో, ఆర్థిక సంపదలో, కళాసంస్కృతుల సముజ్జ్వల దీప్తిలో ఉన్నతస్థితి కలిగిఉండేది. తనకు ముందున్న సామ్రాజ్యాల మాదిరిగానే అంతకన్న ఘోరంగా, అదే పతనంలో, బయటనుంచి వచ్చిన దాడి వల్లకాక అంతరంగ విచ్ఛిన్నత వల్లనే అది కుప్పగూలి విఫలమైపోయింది. కేంద్రీకృతమైన పరిపాలనా సైనిక సామ్రాజ్యం భారతదేశ సజీవ రాజకీయ సమైక్యతను ఎన్నటికీ సాధించలేదు ప్రాంతీయ ప్రజాసంఘాలలో ఒక నూతన జీవితం తలఎత్తేట్లు కనిపించినా యూరోపియన్ జాతులు బలాత్కార ప్రవేశం చేయటం, విప్లవాల వైఫల్యం కారణంగా లభించిన సదవకాశాన్ని వారు స్వాధీనం చేసుకొనటం, తదనంతరం ఏర్పడిన అరాజక క్షీణతల వల్ల కలిగిన తెగింపు సందిగ్ధ పరిస్థితి ఈ అవకాశాన్ని మొగ్గలోనే తుంచివేశాయి.

పాత పరిస్థితులలో కొత్త జీవితానికి పునాదులు నిర్మించటానికి, విచ్ఛిన్నదశలో, భారతీయ రాజకీయ మనఃస్థితి చేసిన చివరి ప్రయత్నంగా రెండు అసాధారణ సృష్టికల్పనలు వచ్చాయి. కాని అందులో ఏదీ సమస్యను పరిష్కరించలేకపోయింది. మహారాష్ట్ర ధర్మం అనే [illegible] భావరూపంతో ఉత్తేజితమై, శివాజీ రూపకల్పన చేసిన మహారాష్ట్ర ప్రజా జీవనం, ఇప్పటికీ అవగాహన అయినంత, జ్ఞాపకం వచ్చినంత, ప్రాచీన రూపాన్ని చైతన్యాన్ని పునఃప్రతిష్ఠించటానికి జరిగిన ఒక ప్రయత్నం. గతాన్ని పునరుద్ధరించే ప్రయత్నాలు విఫలం కాకతప్పదు కనుక, ఆధ్యాత్మిక ప్రేరణ ఉన్నప్పటికీ, ప్రజాస్వామ్యశక్తుల తోడ్పాటు [illegible] ఉన్నప్పటికీ అది విఫలమైపోయింది. పీష్వాలు ఎంత ప్రజ్ఞావంతులైనా సంస్థాపకునికి ఉండే దూరదృష్టి లేకపోవటంవల్ల వారు ఒక సైనిక రాజకీయ కూటమిని మాత్రం స్థాపించగలిగారు. తనను తాను అధిగమించలేని సజీవ సమైక్య భారతాదర్శాన్ని జాగృతం చేయలేని ఒక ప్రాంతీయాభిమానం వారిని ఉత్తేజపరచటం మూలంగా, సామ్రాజ్య స్థాపనకోసం వారు చేసిన ప్రయత్నాలు విజయం పొందలేదు. మరొకవైపు సిక్కుఖాల్సా అద్భుతమైన కాల్పనిక వినూత్నసృష్టిగా అవతరించింది. దానిచూపు గతం వైపు గాక భవిష్యత్తువైపే తిరిగి ఉంది. మతసంబంధమైన మేరకులో ప్రజాస్వామ్య ప్రేరితమైన ఆత్మ, నిర్మాణాలలో, గంభీర ఆధ్యాత్మికారంభంలో, ఇస్లాంలో, వేదాంతంలో ఉన్న లోతైన అంశాలను సమన్వయం చేసిన మొట్టమొదటి ప్రయత్నం కావటంలో, అది ప్రత్యేకమైనది. అస్తిత్వాన్ని సంపాదించుకొన్నదే అయినా, మానవసమాజం మానసిక [illegible] ఆధ్యాత్మిక దశలో ప్రవేశించటానికి తొందరపాటుతో కూడిన ప్రయత్నం. దాని చైతన్యానికి బాహ్యజీవితానికి మధ్య సమృద్ధమైన సృజనాత్మకమైన ఆలోచన సంస్కృతులతో కూడిన ప్రసార మాధ్యమాన్ని అది సృష్టించలేకపోయింది. ఆ విధంగా ప్రతిబంధకాలకు లోనై అసమర్థమై, [illegible]

స్థానిక అవధుల మధ్యనే అవతరించి అంతరించింది. తీవ్రతనేగాని విస్తృ
తశక్తిని సాధించలేకపోయింది. ప్రయత్నం బహుపరిధం కావటానికి ఆవశ్య
మైన పరిస్థితులు అప్పుడు లేవు.

ఆ తరువాత వచ్చింది నిశాంధకారం, సమస్త రాజకీయసృష్టికి, చై
తన్య తాత్కాలిక భరతవాక్యం. పాశ్చాత్య ఆదర్శాలను రూపాలను పరిచా
విధేయతతో అనుకరించి, పునరుత్పత్తి చేయటానికి క్రిందటితరం చే
జీవరహిత ప్రయత్నాలు భారత ప్రజల రాజకీయ మనఃస్థితికి, ప్రతిభకు
మైన సూచన కాదు. అయినప్పటికీ ఈ గంధర్వగోళపు మసక తెరల మ
ఒక సంధ్యాసమయం-సాయంసంధ్య కాదు. ప్రాభాతసంధ్య (యుగసంధ
పొడసూపే అవకాశం ఉన్నది. యుగయుగాలు వర్ధిల్లిన భారతదేశం వ
చెందనూ లేదు, తన చివరి సృజనాత్మక పదాన్ని, ఇంకా ఉచ్చరించలే
అది బ్రతికే ఉంటుంది ; తనకోసం మానవప్రజానీకంకోసం అది చే
వలసిన పని ఇంకా మిగిలి ఉన్నది. ఇప్పుడు మనం మేల్కొల్పవల
ఆంగ్ల మానసపుత్రులై పశ్చిమం చెప్పుచేతలలో వర్తించే విద్యా
పశ్చిమ విజయ వైఫల్యాలను పునః ప్రవృత్తం చేయటమే నొసట వ్రా
సెట్టి ఉన్న ప్రాగ్దేశీయులను కాదు. తన లోతైన ఆత్మను తిరిగి స
ధించుకొని, ప్రకాశబలిష్ఠతల సర్వోత్కృష్ట మూలాధారంవైపుకు శిరస
ఉన్నతం చేసి స్వధర్మ సంపూర్ణార్థాన్ని, సువిశాలరూపాన్ని కనుగొనట
ఉపక్రమించే ప్రాచీన చిరస్మరణీయశక్తిని ఈనాడు మేల్కొలపవ
ఉన్నది.



లైన సమాజాల వ్యవహారాలను విధేయ, పరిమితాధికారంతో మాత్రం నిర హించేవి. తనరాజకీయ స్వభావం అంతరించిపోయిన తర్వాతకూడ "కులం" (Clan family) ఒక సాంఘిక-మత సంస్థగా ప్రముఖంగా క్షత్రియులలో కొనసాగింది. తన కులధర్మ సాంప్రదాయాన్ని, కొన్ని సందర్భాలలో కుల సంఘ సాంప్రదాయాన్ని అది సంరక్షించుకున్నది. చాలా ఇటీవలి కాలంలో, దక్షిణదేశంలో పూర్వపు సాధారణ ప్రజాసభ పాత్రను నిర్వ హించిన ప్రజాసభలు, అనేకం సహజీవనాన్ని సాగిస్తూ, వేరుగాగాని ఒకే రీతిలోగాని వ్యవహరిస్తూ, ఈ మాదిరి సంస్థకు రూపాంతరాలుగా ఉండేవి. రాజపుటానాలో గూడ కులం (Clan family) తన రాజకీయ స్వభావాన్ని చర్యను తిరిగి సంపాదించింది కాని క్షత్రియ ధర్మానికి చెందిన సాహస, పరాక్రమ ఔదార్య, ప్రతిష్ఠలను ఉన్నత పరిమాణంలో నిలబెట్టుకొన్నప్ప టికీ, ప్రాచీన సంస్థలుగాని సునిశ్చితమైన సంస్కృతీ స్వభావంగాని లేని మరొక రూపంలోనే సంపాదించింది.

నాలుగు వర్ణాల చట్టంలోనే పెరిగి చివరకి దానిస్థానాన్ని తానే ఆక్రమించి అసాధారణ జీవశక్తితో నిలకడను ప్రాముఖ్యతను పొంది, చారిత్రకమై, క్షీణ క్షితిలో ఉన్నా, ఈనాటికీ వదలకుండా, జాతి (Caste) అనే సంస్థ భారత సామాజిక వ్యవస్థలో శాశ్వతమైన అంశంగా ఉండి పోయింది. వివిధ శక్తుల ఒత్తిడి వల్ల ప్రతి వర్ణంలోను విస్తరించిన ఉప విభజనల నుంచి, ఆరంభంలో, ఇది జన్మించింది. బ్రాహ్మణజాతులలో ఉపవిభజన ప్రధానంగా మత, సాంఘికమత, కర్మకాండల వల్ల కలిగినా, ప్రాంతీయస్థానిక విభజనలుకూడ ఉండేవి: క్షత్రియులు కులాలుగా విభజించ బడినప్పటికీ చాల వరకు ఒకటిగానే ఉండేవారు. దీనికి విరుద్ధంగా వారసత్వ